ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# కథానికా వాఙ్మయం



రచయిత
పోరంకి దక్షిణామూర్తి




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్ద లందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వ యుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను ధృడతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన, తెలుగు ఉగాది రోజున, ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కో-వంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు.

ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియం) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజుల పాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదం చేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదం చేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

**జలగం వెంగళరావు**
**అధ్యక్షులు**
**ప్రపంచ తెలుగు మహాసభలు**

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975 వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో నివసించు చున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటాయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు, ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్య క్రమాల సమన్వయసంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా, సాహిత్య, కళా, చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వాహణకై 44 మంది సభ్యులుకల ఒక విద్వత్‌సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది ఆ విద్వత్‌సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప

వలసినదిగ ప్రపంచ తెలుగుమహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంధశ్రేణిలో ఈ **కథానికా వాఙ్మయం** అను గ్రంథమును, రచించిన శ్రీ పోరంకి దక్షిణామూర్తి గారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన శివాజీ ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు
19-3-1975

# కథానికా వాఙ్మయం

తెలుగుదేశం కథలకు కాణాచి * ప్రపంచంలో ఏభాషకూ తీసిపోని కథా సాహిత్యం తెలుగువాళ్లకుంది. ప్రపంచంలో ఏ భాషకయినా ప్రతిష్ఠ తేగల కథకులు తెలుగుదేశంలో ఉన్నారు. అయితే, రాశి విషయంలో నయితేనేం, వాసి విషయంలో నయితేనేం-కథాసాహిత్య పరిస్థితి. తెలుగువాళ్ల అభిరుచులకూ, దృక్పథాలకూ, అవగాహనకూ, కృషికీ ప్రతిబింబమేనని చెప్పాలి. అంటే, మనమెందాకా పెరిగితే మన 'కథ' కూడా అందాకా పెరుగుతుందని తాత్పర్యం.

ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో ఎక్కువ జనాన్ని రంజింపజేసేది 'కథానిక'. ఒక్క తెలుగుదేశంలో విషయంలోనేకాదు ; ప్రపంచమంతటా ఇది నిజమని తేలింది. పరిమాణంలో చిన్నది కావడాన్నిబట్టి దాని విలువనుకూడా చిన్నదిగానే అంచనావేసే పొరపాటు ఇప్పటి సాహితీ-వేత్తలు చెయ్యడంలేదు ఇది ఆహ్లాదకరమైన విషయం

తెలుగుదేశంలో కథానిక పుట్టి-హిందీలో లాగే-అరవైనాలుగు సంవత్సరాలకు మించకపోయినా, దేశంలో ఏ ఇతర భాషా సాహిత్యంలోని కథానికకయినా దీటయిన సంపత్తిని సమకూర్చుకుంది అంతేకాదు, ఒక తెలుగు రచయితకు ప్రపంచస్థాయిలోనే పెద్దపీట వేయించింది ఇది మనకు గర్వకారణం.

తెలుగువాడికి 'కథానిక' అన్న పదంమీద అట్టే మోజులేదు. పిన్నలకేమిటి, పెద్దలకేమిటి ; పండితులకేమిటి, పామరులకేమిటి- 'కథ' అన్నపదమే ఇష్టం. 'చిన్నకథ' అనడంకూడా కద్దు. కాని అల్లా అనేవాళ్ళు తక్కువే-చిన్నకథకూడా కథే కాబట్టి, అన్నిటికీ పనికొచ్చే పదం వాడ్డమే మనకి అలవాటు. పైగా 'చిన్నకథ' అన్నది ఇంగ్లీషులో 'షార్ట్ స్టోరీ' అన్న దానికి ఫిరాయింపు. ఇంగ్లీషులోకూడా చిన్నగా ఉన్న కథల్లా 'చిన్నకథ' కాదు. తెలుగులోనూ అంతే. ఇది ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియ. చిన్నగా ఉండటమన్నది దాని లక్షణాల్లో ఒకటికాని, అదొక్కటేకాదు. ఇంగ్లీషులోను, తెలుగులోను, ఇతర భాషల్లోను వెలువడ్డ కథ

* అందుకే కదా 'బృహత్కథ' ఇక్కడ పుట్టింది !

లనేకం దీన్ని నిరూపిస్తాయి. ఉదాహరణకు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'మార్గదర్శి' ఉంది. అచ్చులో అది వందపేజీలపైచిలుకు ఉంది అయినా అది చిన్నకథే. శాస్త్రిగారు దాన్ని చిన్నకథ అన్నారనేకాదు, చిన్నకథకు కావలసిన 'ఏకసూత్రత' దాంట్లో ఉంది.

చిన్నకథ అనడంలో ఇంకో చిక్కుకూడా ఉంది చిట్టికథలూ, పొట్టికథలూ, పిట్టకథలూ ఉత్తుత్తికథలూ కూడా ఉన్నాయి మనకు. వీటన్నిటినీకూడా చిన్నకథలే అనవలసి వస్తుంది అంటే, కథలన్నిటినీ గుచ్చెత్తి రెండు పాయలుచేస్తే కనక, పెద్దకథలు కానివన్నీ చిన్నకథలకిందే లెక్కకు వస్తాయన్నమాట !

ఇకపోతే, చిన్నకథకు సమానార్థకంగా, పారిభాషికత సమకూర్చిన పదం 'కథానిక'. కథానకమన్నది దీనికి రూపాంతరం. ఇతివృత్త భేదాన్నిబట్టి కథా, ఆఖ్యాయికా, ఖండకథా, పరికథా కథాలికా అనే గద్య ప్రబంధభేదా లున్నాయని కావ్యాదర్శ వ్యాఖ్యాత, జీవానంద విద్యాసాగర భట్టాచార్యులు తెలిపినట్టుగా విజ్ఞులంటారు అగ్నిపురాణంలో ఈ పరిభాష ప్రస్ఫుటంగా ఉంది అయితే దాన్ని వెలికితెచ్చి తెలుగువాళ్లకు బాగా అలవాటు చేసినవారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు. ఇంగ్లీషులో పారిభాషికత సంతరించుకొన్న 'షార్ట్‌స్టోరీ' అన్నదానికి సమానార్థకపదం భారతీయులకు ఎంతకాలంనుంచో ఉందనడానికిది మంచి నిదర్శనం. అయితేనేం ? ఈ ప్రక్రియ ఈ శతాబ్దిదాకా సాహిత్యగౌరవానికి నోచుకోక పోవడం వల్ల, ఈ శాఖలో సాహిత్యమంతగా వర్ధిల్లలేదు. దాంట్లోకూడా, కాలగర్భంలో కలిసింది కలవగా, తక్కింది ప్రజల నోళ్లలో నలుగుతూ, రకరకాలుగా మారుతూ వచ్చింది. దాంట్లోకూడా, ఏదో ఒక రూపంలో గ్రంథస్థమైంది ఇంకా తక్కువ. దాన్ని గుర్తుపట్టడానికి తగ్గ ఆధారాలుకూడా మృగ్యం. ఇది ఇలా ఉండగా, మరొక శాఖ ఉంది– జానపదుల్లోనేపుట్టి ఆనోటా ఆనోటా పాకిన కథలు. దీనికున్న విస్తృతి అంతా ఇంతాకాదు. కథలంటే జనం చెవికోసుకుంటారు కనక ఏవేవో కథలు ప్రతి దేశంలోనూ, ప్రతి జాతిలోనూ పుడుతూనే ఉంటాయి. మార్పులకూ చేర్పులకూ లోనవుతూ ఉంటాయి. పోయినవిపోగా, ఏ మహానుభావుడో పుణ్యంకట్టుకుంటే వాటిలో కొంత పాలు గ్రంథస్థమవుతాయి ; లేకపోతే అదీ లేదు.

నిజం చెప్పాలంటే, ప్రపంచంలో ప్రతి మానవసముదాయంలోనూ ఊహ తెలిసిన తొలినాళ్ళలోనే కథనం మొదలవుతుంది. అది, జరిగిన ఒక సంఘటనకు

సంబంధించిందయినా కావచ్చు ; కల్పితమయినా కావచ్చు ; వాస్తవికంగానూ ఉండొచ్చు ; అవాస్తవికంగానూ ఉండొచ్చు ; మానవులకు సంబంధించిందీ కావచ్చు ; మానవేతరాలకు సంబంధించిందీ కావచ్చు. కావలసిందల్లా, కథ. దానికి, మనస్సును ఆకట్టుకునేట్టు చమత్కారంగా చెప్పగల మాటకారి కావాలి. అట్లాటి నేర్పరి చుట్టూ, పళ్ళగంపచుట్టూ మూగినట్టు మూగుతారు జనం పనిపాట్లు అయింతరవాత భోజనాలు పూర్తిచేసి తీరిగ్గా కూర్చుని చెప్పుకునేవాళ్ళు కొందరు , చలి మంటలేసుకుని చుట్టూ చేరి చెప్పుకునేవాళ్ళు కొందరు ; మనవణ్ణో, మనవరాల్నో జోకొట్టడానికి చెప్పేవాళ్ళు కొందరు- ఇల్లా రకరకాల వాళ్ళు రకరకాలుగా కథలతో కాలక్షేపం చేస్తూ ఉంటారు. ఇందులో తెలుగువాళ్ళు మాత్రం ఎలాతీసిపోతారు ?

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, తెలుగువాళ్ళకు అనేకవందల సంవత్సరాలుగా కథావాఙ్మయం ఉంది; కాని దానికి నిర్దిష్టమైనరూపం ఏర్పడ్డం మట్టుకు ఈ శతాబ్ది లోనే జరిగింది. దానికి ఒరవడి పెట్టింది పాశ్చాత్య సాహిత్య సంపర్కం.

ప్రపంచానికసలు కథాభిక్ష పెట్టింది భారతదేశమని-మనవాళ్ళ సంగతి సరే- విదేశీయులున్నైతం అంటూంటారు. వివిధ దేశాల కథాసాహిత్యంలో భారతీయమైన ఛాయలు గోచరిస్తున్నాయని, అందుకు నిదర్శనంకూడా చూపిస్తూంటారు.

భారతదేశంలో గ్రంథస్థమైన వాఙ్మయంలో ప్రాచీనమైన కథాబీజాలున్నది ఎక్కడో అన్వేషించాలంటే వేదకాలానికి పోవలసి ఉంటుంది.

ఋగ్వేదం, భారతదేశంలోనేకాక ప్రపంచం మొత్తంలోనే అత్యంత ప్రాచీనమైన వాఙ్మయంగా గుర్తింపు పొందింది. అందులో శునశ్శేపుడి వృత్తాంతం, సరమా సంవాదం, యమయమీ సంవాదం, ఊర్వశీపురూరవ సంవాదం ఒకరకమైన కథాబీజాలు. అలాగే ఐతరేయం, శతపథంవంటి బ్రాహ్మణాలున్నాయి. హరిశ్చంద్రుడి మూలకథకు ఇవేకదా ఆకరాలు ! ఉపనిషత్తుల్లో యాజ్ఞవల్క్యుడు, మైత్రేయి, నచికేతుడు, రైక్వుడు, రాజాజనశ్రుతి, శ్వేతకేతు-ఉద్దాలకులకథలు, అశ్వినీ కుమార దధ్యంగులకథలు మొదలైనవి ఉన్నాయి.

వీరపూజ, ధర్మభావన ప్రధానప్రేరకాలుగా వెలువడ్డ రామాయణ మహాభారతాల్లో రోచకమైన కథోపకథలనేకం ఉన్నాయి. మన పురాణాల్ని కథాసాగరాలేనని చెప్పాలి. వీటిలో మానవమాత్రులుగా వ్యవహరించే పాత్రలు కోకొల్లలు.

రానురాను సమాజం పెరిగేకొద్దీ ప్రజల్ని ధర్మబద్ధుల్ని చేయడానికి నీతి ప్రధానమైన కథలు రాయడంకూడా మొదలైంది. వీటిలో కొన్ని మహాత్ముల జీవనచిత్రణలూ అనేక జన్మలకు సంబంధించిన కథలూ-జైనగాథలు, బౌద్ధజాతకకథలు వంటివి. మరికొన్ని కౌతుకకథలు, మరికొన్ని స్పష్టనీతికథలు. కొన్నిటిలో పశుపక్ష్యాదుల్నిసైతం మనుష్యుల్లాగే నడిపించారు మనిషిలోని మంచిచెడ్డల్ని వాటికి ఆరోపించి అద్భుతంగా ప్రదర్శించారు. బృహత్కథ, పంచతంత్రం, హితోపదేశం, బేతాళపంచవింశతి, సింహాసన ద్వాత్రింశిక, కథాసరిత్సాగరం, శుకసప్తతి మొదలైన రచనలు భారతీయుల కథాకల్పనాశక్తికి నిదర్శనాలు.

ఈ సందర్భంలో ప్రత్యేకంగా చెప్పుకోవలసింది-ప్రపంచకథావాఙ్మయానికే ఆదిగ్రంథ మనదగ్గ బృహత్కథ గురించి దీన్ని పైశాచీ ప్రాకృతంలో రాసినవాడు గుణాఢ్యుడు. ఈయన క్రీ. పూ. 200-150 మధ్యకాలంవాడని-అంటే ఆంధ్రశాతవాహనుల ఏల్బడిలోవాడని చారిత్రకుల అభిప్రాయం. ఈయన ఆంధ్రుడు కావడం మనకు గర్వకారణం. అలా గుర్తించడం అతి గర్వకారణమనుకో నక్కరలేదు-ఆత్మగౌరవ ప్రదమన్న గ్రహింపు ఉంటే చాలు.

ఉత్తరోత్తరా వెలువడ్డ సంస్కృత సాహిత్య భండారం ప్రఖ్యాతవస్తువులతోను, కల్పిత వృత్తాంతాలలోను అనేక కథాకావ్యాలు సృష్టించింది వీటికి యావద్దేశవ్యాప్తి ఉండటంవల్ల తెలుగుదేశంకూడా వాటిని ఆదరించింది; ఆనందించింది.

పదకొండో శతాబ్దంవచ్చేసరికి, అనేకానేక కథలతో సంకీర్ణమైన మహాభారతం తెలుగులో పాదుకుంది. నన్నయ్యగారుపెట్టిన ఒరవడి అనేక శతాబ్దాలకు ఆదరణీయమైంది నన్నెచోడుడి ప్రత్యేకత ఉండనే ఉంది. పాల్కురికి సోమన వంటివాళ్ళ ప్రకృతికి ఆకృష్టులైనవాళ్ళు ఎందరులేరు ? తిక్కనగారు పెట్టిన భిక్ష ఏ తెలుగువాడు మరిచిపోగలడు ? తదాదిగా, తెలుగు కావ్యసంపత్తిని పెంపొందిస్తూ వచ్చిన మహాకవులు, దేశంలోని ఇతరభాషల కావ్యకర్తల్లో ఎవరికి తీసిపోతారు ?

అయితేనేం ? తెలుగులో సాహిత్యమన్నది పద్యకావ్యానికే పర్యాయపదమైంది. కాని ఆ కావ్యాలకు వస్తువులు సమకూర్చినవి మాత్రం కథలే-ప్రఖ్యాతాలో కల్పితాలో ! దశకుమారచరిత్ర, సింహాసనద్వాత్రింశిక, శుకసప్తతి, హంసవింశతి మొ. కథలు తెలుగులోకూడా రూపుదిద్దుకొన్నాయి. ఇలా అనేకానేక శతాబ్దాలపాటు, సాహిత్య గౌరవంపొందిన తెలుగు వాఙ్మయంలో కథ, కవిత్వంలోనే ఒదిగి జీవించవలసి వచ్చింది.

ఇది ఇలా ఉండగా, మరో పక్క, కథాకథన సంప్రదాయమన్నది, ప్రపంచంలో తక్కిన చోట్లలాగే తెలుగుదేశంలోకూడా సామాన్యజనుల్లో ఆదరణ పొందుతూనే ఉంది. దీన్ని నిలబెట్టినవాళ్ళలో ప్రధానంగా చెప్పుకోవలసినవాళ్ళు, కథాకథనమే జీవన వ్యాసంగంగా పెట్టుకున్న బీరన్నలవాళ్ళు, ఒగ్గివాళ్ళు, పిచ్చుకకుంట్లవాళ్ళు మొదలైనవాళ్ళు లేకపోతే, బాలనాగమ్మకథ, దేసింగురాజుకథ, పల్నాటియుద్ధం, లక్ష్మమ్మకథ, ఎల్లమ్మకథ, కాంభోజరాజుకథ మొదలైనవి దేశంలో ఇన్ని తరాలవాళ్ళూ విని ఆనందించే అవకాశమే లేకుండాపోయేది.

ఇకపోతే, ఇళ్లల్లో సంగతి. 'మనకి తాతయ్యలూ నాయనమ్మలూ ఎందుకర్రా?' అని ఏపిల్లవాణ్ణయినా అడిగితే కనక, 'తాయిల్లం పెట్టడానికీ, కథలు చెప్పడానికీ' అని ఇట్టే చెప్పేస్తాడు ''అనగనగా ఒక రాజు, ఆ రాజుకి ఏడుగురు కొడుకులు'' అన్న కథ ఏనాడు పుట్టిందోకాని ప్రతితరం పిల్లకాయకీ, ఆ కథ పదేపదే చెప్పించుకోడం సరదా. రాజుల కథలు, రాజకుమార్తెల కథలు, అందాల బొమ్మల కథలు, ఆకతాయి పిల్లల కథలు, రాక్షసుల కథలు, దెయ్యాల కథలు - ఇల్లా ఒకటేమిటి, రకరకాల కథలు ఆశువుగా వచ్చేస్తూంటాయి. చెప్పిన కథ చెప్పకుండా, వచ్చిన వాటినే రకరకాలుగా మారుస్తూ రకాలుగా మలుపులు తిప్పుతూ చెప్పే నేర్పరులు తెలుగు ఇళ్లల్లోనూ, తెలుగు ఇల్లాళ్లలోనూ ఎందరో ఉన్నారు. భయాన్ని చేప్పేదికూడా నయాన్ని చెప్పి నప్పించే సాధనం కథ. అయితే ఇల్లాటి కథల్లో చాలా భాగం నశించిపోతోంది. అయినా, కథలు పోయినా కథన చాతుర్యం నిలిచి ఉన్నందుకే సంతోషించాలి మరి!

తెనాలి రామలింగడి కథలు, మర్యాదరామన్న కథలు, కాశీమజిలీ కథలు మొదలైనవి తెలుగు దేశమంతటా వ్యాప్తిలో ఉన్నా కథకుడి ఉత్సాహాన్నిబట్టి అవి తీరుతీర్లుగా మారుతూంటాయి. చల్లనివేళ తెలుగువాడు తలుచుకోవలసిన మహానుభావుడు సి. పి. బ్రౌన్. ఆయన తెలుగు దేశానికీ అందించిన అనేక అపురూప గ్రంథాల్లో 'తాతాచార్ల కథలు' అన్నసంపుటం ఒకటి. ఈ కథలు చెప్పినవాడు తాతాచార్లుగారు, సి. పి బ్రౌన్ దగ్గిర పనిచేసిన పండితుడు. మంచి ఎత్తరీ, స్ఫురద్రూపీ అయిన యాభైఏళ్ళ ఈ పండితుడు బహుచమత్కారంగా కథలు చెప్పేవాడట. అవి వింటూంటే, బ్రౌనుకుర్కూడా, వాటిని రాసిపెట్టేదాకా మనసు ఊరుకోలేదు. అదీ మన మంచికే అయింది. లేకపోతే, ఆనాటి కథాకథనం

తీరు మనకు తెలియకుండా పోయేది.* వీటిలో 'దుగ్గిశెట్టి కొడుకు ఎవరు ఎవరు, పొగలోని మజా, గుడిని మసీదుగా మార్చిన రాయిజీ, మధ్వమరం గజేంద్రుడు, అల్లాచేరిన నవాబు, నవాబు రూపాయీలు – రాణిముద్రలు, గిరిన్మయూరే, ముసద్ది మాష్టీతు, జైలుఖానా జ్యోతిషం, నిఘంటుపూజ, దేవరమాకులు' మొదలైన కథలు ఆనాటి వాడుక భాషకు అద్దంపడతాయి. ఆయన చెప్పిన వాటిలో కొన్ని కథలు, కొత్తవాడికి కఠినంగా ఉంటాయని, బ్రౌన్ ఆ సంపుటంలో చేర్చలేదు. ఆలా, ఆయన వదిలేసిన వాటితోపాటు కొన్ని 'అదనపు కథలు' కూర్చి సమగ్రమైన సంపుటం రూపొందించారు బంగోరె.

బ్రౌన్‌కు ముందే ఇటువంటి ప్రయత్నం. మరో బృహత్ప్రయత్నంలో అంతర్భాగంగా, చేయించినవాడు కల్నల్ మెకంజీ. మన దేశంలో సర్వేయర్ జనరల్‌గా పనిచేసిన వాడాయన. దేశంలో వివిధ మండలాల్లో ఉన్న జనావాసాల స్థానిక చరిత్రలను (మెకాంజీ లోకల్ రికార్డ్‌లనీ, మెకంజీ కైఫియత్‌లనీ ప్రసిద్ధమైనవి.) భౌగోళిక, చారిత్రకాది అంశాలన్నిటితోనూ సేకరించడం జరిగింది. ఈ కృషిలో ఆయనకు తోడ్పడ్డ పండితుల్లో, పర్యటన పరిశోధకుల్లో పేరెన్నిక గన్న వారు కావలి వెంకటబొర్రయ్య, పులిగడ్డ వెంకయ్య మొదలైన వాళ్ళు కేవలం తెలుగు దేశానికే సంబంధించిన సంపుటాలు ఎనభై వరకు ఉన్నాయి (ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వాటికి ప్రతులు రాయించి భద్రపరిచింది.) వీటిలో చారిత్రకాంశాలతోబాటు జనబాహుళ్యంలో వ్యాప్తిలో ఉన్న కథలు కూడా కొన్ని చోటు చేసుకున్నాయి. (ఉదా॥ 'కంకణాల పల్లి' అన్న గ్రామానికి ఆ పేరు ఎలావచ్చిందో చెప్పే కథ).

'చార్దర్వేష్ కథలు' 'పలుకని పద్మాక్షి' కథలు మొదలైనవి తెలుగు పాఠకుల ఆదరాన్ని అందుకున్నాయి. మధిర సుబ్బన్న దీక్షితులుగారి 'కాశీమజిలీ కథలు'కు వచ్చిన ప్రచారం అంతా ఇంతాకాదు. ఆ కథలన్నీ ఆయన సొంతంకావనీ వెనకటి నించీ ప్రచారంలో ఉన్నవాటిని ఆయన వాడుకున్నాడనే అనేవాళ్లు కూడా ఉన్నారు. అయినప్పటికీ ఆ కథలు చేసినమేలు మరవరానిది; దేశంలో పఠనాసక్తి పెంపొందడానికి చాలా తోడ్పడ్డాయి.

---

* 'బంగోరె' పూనికతో ఈనాటికది మళ్ళీ అచ్చయింది (జూలై 1974, యం. శేషాచలం అండ్ కంపెనీ). ఈ కథల్లోవచ్చే నెల్లూరి జిల్లా పలుకుబళ్ళ అర్థవివరణతో బాటు, ఆయా వృత్తాంతాల చారిత్రక నిదర్శనాల్ని కూడా సంతరించడానికి బంగోరె చాలా శ్రమించారు.

చిన్నయసూరిగారికి సీనియర్ సహోద్యోగి, రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారు పంచతంత్ర కథలకు చేసిన అనువాదం దాదాపు నలభై సంవత్సరాలపాటు పాఠ్యగ్రంథంగా నిలబడింది ఆనాటి వ్యవహారిక భాషారూపాలను కూడా ఉదారంగా వాడటం శాస్త్రిగారిలో విశేషం తరవాత చిన్నయసూరిగారు హితోపదేశ కథల్ని ఎన్నుకుని నీతిచంద్రిక అన్న పేరుతో మిత్రలాభ, మిత్రభేదాల్ని అనువదించారు ఈయన రాసింది పూర్తిగా కావ్యభాష. శైలి ఆలంకారికంగాను, సంవాదాత్మకంగాను తెలుగు పలుకుబళ్లతో నిండి ఉంటుంది. అనేక దశాబ్దాలపాటు, అనేక తరాల పిల్లల నోళ్లలో నలిగే రచన చేయడం సూరిగారి విశేషమూ అదృష్టమూ కూడా.

పంధొమ్మిదో శతాబ్దం ఉత్తరార్ధంలో మూడు ప్రెసిడెన్సీ కేంద్రాలోనూ మూడు విశ్వవిద్యాలయాలూ కళాశాలలూ ఏర్పడ్డం దేశచరిత్రలో పెద్దమలుపు. వాటి మూలంగా సార్వజనిక విద్యావిధానం రూపొంది, విద్యావంతుల సంఖ్యను పెంచుతూ వచ్చింది. ఇతర భాషా సాహిత్యాలతో పరిచయం కూడా పెరుగుతూ వచ్చింది. అటు ఆంగ్ల సాహిత్యంలోనూ, ఇటు తెలుగు, సంస్కృత సాహిత్యాల్లోనూ పాండిత్యం గడించినవారు ఎక్కువయారు. వృత్తిరీత్యానో, ప్రవృత్తిరీత్యానో ఎవరు ఏరంగంలో పనిచేస్తున్నా ఇతర రంగాలగురించి లోతుగా గ్రహించడానికి పూనుకోడం మొదలైంది. తులనాత్మక పరిశీలన ప్రవర్ధమానమైంది కందుకూరి వీరేశలింగం పంతులు, వేదం వేంకటరాయశాస్త్రి, జయంతి రామయ్య పంతులు, కొక్కొండ వెంకటరత్నం, ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ, కొమర్రాజు లక్ష్మణరావు, గురజాడ వేంకట అప్పారావు, గిడుగు వేంకట రామమూర్తి పంతులు మొదలైన వాళ్లు అటు పంధొమ్మిదో శతాబ్ది కడపటి భాగంలోను, ఇటు ఇరవయ్యో శతాబ్ది మొదటి భాగంలోనూ పేరెన్నికగన్న ప్రముఖ సాహితీవేత్తలు వీరిలో ప్రతి ఒక్కడూ ఒక దిగ్గజం లాటివాడు అందులోనూ కందుకూరి, తానే ఒక సంస్థగా వెలుగొందిన మహావ్యక్తి; ''ఆధునికాంధ్రదేశం అఖండ గౌతమి అయితే, అది పుట్టిన నాసికాత్ర్యంబకం కందుకూరి వీరేశలింగం'' అంటూ కృష్ణశాస్త్రిగారన్న మాటలు అక్షరాలా సార్థకమైనవి.

పంతులుగారుచేసిన రచనలు చాలావరకు ఉపదేశాత్మకమైనవి. మన సమాజంలో పాతుకొని ఉన్న దురాచారాల్నీ, మూఢవిశ్వాసాల్నీ, వెల్లడిచేయడానికి ఆయన చేబట్టిన ప్రక్రియల్లో కథకూడా ఒకటి. అయితే దాన్ని ఒక ప్రత్యేక

సాహిత్య ప్రక్రియగా స్పృహలో ఉంచుకొని పెంపొందించడం మాత్రం జరగలేదు. జొనాథన్ స్విఫ్ట్ రాసిన 'గలివర్స్‌ట్రావెల్స్' ప్రేరణతో సత్యరాజాపూర్వదేశ యాత్రలు' రాశారాయన. అందులో గుదిగుచ్చినకథలు ఎందరినో ఆకర్షించాయి. 'ఈసప్స్‌ఫేబుల్స్'ను 'ఈసపు నీతికథలు' అన్న పేరుతో అనువదించడంకూడా జరిగింది ఈ విధంగా పంతులుగారు రాసిన కథలు ప్రయోజనపరంగా ప్రాముఖ్యం పొందాయే తప్ప ప్రక్రియాపరంగా ప్రాధాన్యం పొందలేకపోయాయి

ఈ మాదిరిగా సాగిన కాలరథం మరో మలుపు తిరిగింది, కొత్త శతాబ్దికి స్వాగతం పలికింది!

అప్పటికే, విజయనగరం రాచవారి కొలువులో ఉండికూడా జనంమీదేచూపు నిలిపి, జనంవేపే చెవి ఒగ్గి, జనంలోనే తనను చూసుకొంటూన్న గురజాడ వేంకట అప్పారావుగారు (1861) 'కన్యాశుల్కం' రాసి కలలు పండించుకున్నాడు. దేశీయచ్ఛందంలో ముత్యాలసరం చూసుకున్నాడు గ్రాంధిక వ్యావహారికభాషా వివాదంలో వ్యావహారిక సత్యానికి ఏడుగడగా నిలిచాడు. దేశవిదేశాల్లో వెలువడే అనేక గ్రంథాల పరిచయంతో నిర్దిష్టమైన, విస్పష్టమైన విద్యా. సాహిత్య దృక్పథాలు ఏర్పరచుకున్నాడు. ఆయన మనస్సులో ఏవేళప్పుడు మెరపు మెరిసిందో కాని, తెలుగువాళ్ళు ఎన్నటికీ మరచిపోని, ఎన్నికైన కథానిక వెలువడింది. విషయిం ఆధునికం, చెప్పేతీరు ఆధునికం, ముగింపు మరీ ఆధునికం. అందుకే ఆధునిక కథానికా వాఙ్మయంలో దానికి ప్రథమ తాంబూలం దక్కింది. కథపేరు **'దిద్దుబాటు'**, వెలువడింది 1910లో- 'ఆంధ్రభారతి' పత్రికలో వేశ్యల ఆకర్షణలోపడ్డ భర్తను నేర్పుగా తనవేపు తిప్పుకొన్న ఇల్లాలికథ. అయినా ఆ ఇల్లాలు కథలో ఎక్కడా ప్రవేశించదు ఆమెనుగురించి భర్తపడే ఆందోళన, ఆమెరాసి పెట్టిన ఉత్తరం, ఆమెతో దౌత్యం జరపడానికి నియుక్తుడైన నౌకరుచేసే ఆర్భాటం, యజమానికీ నౌకరుకూ జరిగే సంభాషణ-ఇవి మాత్రమే కథలో కనిపిస్తాయి. అయితే కథ చివరిలో మట్టుకు "అమృతం వొలికే కలకలనవ్వూ, మనోహరియైన నూపురములరొద, విననయ్యేను." కథలో పనితనం బాగుంది. అప్పారావుగారు మొదట దీన్ని గ్రాంథికంలోనే రాసినా, తరవాత వ్యావహారికంలోకి స్వయంగా మార్చుకున్నందుకు దాఖలాగా అవసరాల సూర్యారావుగారు రెండు పాఠాలూ ముద్రించి చూపించారు.

ఈ విధమైన రచన తెలుగు కథావాఙ్మయంలో అపూర్వం కావడంవల్లనే కాక, కథానికా ప్రక్రియకు కావలసిన లక్షణాలు ఉండటంవల్లకూడా దీనికి ప్రాధమ్యం వచ్చింది. ప్రాచీనకాలంలో అగ్నిపురాణంలోను, అర్వాచీన కాలంలో పాశ్చాత్య విమర్శ గ్రంధాల్లోను చెప్పిన కథానికా లక్షణాలను సమన్వయం చేసుకుంటే కథానికను ఇలా వ్యవహరించవచ్చు · ఒకరకమైన ఎత్తుగడ, నడకతీరు, ముగింపు, కొన్ని పాత్రలు, ఆ పాత్రలకు చక్కని పోషణ, వస్తువిన్యాసవైశిష్ట్యం, ఏదైనా ఒక జీవితసత్యాన్ని ప్రతిపాదించడం, అన్నిటినీమించి వస్త్వైక్యం ఉండి వినోదమో, విజ్ఞానమో, వికాసమో కలిగించగల చిన్నకథ 'కథానిక' *

దానికి ఉండే లక్షణాలివి :

(*1*) *సంక్షిప్తత :* వస్తువులోను, సంఘటనల్లోను, పాత్రల్లోను, సంవాదాల్లోను విస్తృతిలేకుండా సాధ్యమైనంత తక్కువలో చెప్పగలిగేటట్టు ఉండే లక్షణం. అనవసరమైన వివరాలజోలికిపోకుండా ప్రతిఅంశమూ ప్రయోజనాత్మకంగా ఉండేటట్లు రచయిత జాగ్రత్తపడాలి.

(*2*) *ఏకాంశవ్యగ్రత :* కథకంతకూ ఒకే ప్రధానాంశం లక్ష్యంగా ఉండాలి. ప్రారంభంలో రచయిత ఏ సూత్రాన్ని అందుకొంటాడో కడకంటా అదే సాగాలి. ఇతర విషయాలు కొన్ని వచ్చినప్పటికీ ప్రధానసూత్రం మరుగునపడిపోగూడదు.

(*3*) *నిర్భరత :* కథానిక చదివేటప్పుడుగాని, రచయిత చెప్పేటప్పుడుగాని మనస్సు మళ్ళిపోకుండా లగ్నంచేసేటట్టు ఉండాలి.

(*4*) *స్వయంసమగ్రత :* కథలోని వస్తువు దానికదే సమగ్రంగా ఉండాలి. అవసరమైందేదో కొరవడినట్టుగాని, అనవసరమైంది చోటుచేసుకున్నట్టుగాని అనిపించకూడదు.

(*5*) *సంవాదచాతుర్యం :* సంభాషణరూపంలో సాగే వాక్యాలు ఒకానొక ప్రధానాంశాన్ని ఆవిష్కరించేటట్టుగానో, ఒకానొక పాత్రవ్యక్తిత్వాన్ని ప్రదర్శించేట్టుగానో ఉండాలిగాని, ప్రయోజనరహితంగా ఏదీ రాకూడదు. అట్లా రావడంకూడా రమ్యంగా ఉండాలి.

---

* బొడ్డపాటి కుటుంబరాయశర్మ, తెలుగు విజ్ఞాన సర్వస్వం, 6వ సంపుటం, 'విశ్వసాహితి' పుట 609.

(6) *ప్రతిపాద్య ప్రవణత :* ప్రతిపాదించదలుచుకున్న అంశాన్ని దృష్టిలో పెట్టుకొని దాని వికాసానికి తోడ్పడేటట్లే రచనసాగాలి.

(7) *ప్రభావాన్వితి :* మొత్తం రచన పాఠకుడిమీదవేసే ముద్ర ఎలా ఉందన్నదీ చూడాలి పై వాటినన్నిటినీ నేర్పుగా సాధించినప్పుడు ఇదికూడా నెరవేరుతుంది.

అప్పారావుగారి 'దిద్దుబాటు' కథకు ఇవన్నీ చక్కగా వర్తిస్తాయి. వస్తువు సంగ్రహమైనది; సంఘటనలు చిన్నవి; సంవాదాలూ సంగ్రహమైనవే గోపాలరావు మనస్సు మారడమన్నది ఇక్కడ ఏకైకలక్ష్యం. తక్కిన వ్యవహారాల ప్రసక్తి లేదు. అక్కడికది స్వయం సంపూర్ణం సంవాదాల్లో గొప్ప చాతుర్యం కనబడుతుంది. పశ్చాత్తప్తుడైన గోపాలరావు తన్ను తాను తిట్టుకుంటాడు భార్య ఏమైందోనన్న ఆందోళనలో నౌకరు దగ్గర బయటపడిపోతాడు. ఆ నౌకరుకూడా తెలివైనవాడే యజమాని పరిస్థితిచూసి మరింత చమత్కారం కనబరుస్తాడు. ఏ రొష్టూ లేకుండా భార్య తిరిగివస్తేనేచాలు అనుకుంటున్న గోపాలరావుకి మంచంకింది నుంచి వినవచ్చిన గాజుల గలగల, కమలిని కిలకిలా తృప్తినిస్తాయి. చెడుదారిపట్టిన మగణ్ణి ఎలా దిద్దుకోవాలో నేర్పుగాచూపిన కమలిని తెలుగువాళ్ళకి ఎన్నటికీ మరుపురాదు.

అప్పారావుగారిదే మరోకథ 'మీపేరేమిటి?' మతమౌఢ్యం పరాకాష్ఠకు ప్రతీకగా నిలిచేకథ ఇది. ఒక పక్క శైవులూ మరోపక్క వైష్ణవులూ తమ తమ ఆధిక్యాన్ని నిరూపించుకోవడానికి పడే పాకులాట చాలా సహజంగా చిత్రించారు రచయిత. వాళ్ళ మూర్ఖత్వాన్ని ప్రదర్శించడంలో అప్పారావుగారు చూపిన చమత్కారం రమ్యమైనది. 'సంస్కర్త హృదయం' మరో పెద్ద కథానిక. మనస్సును ఆర్ద్రం చేసే కథానిక 'మెటిల్డా' ముసలి మొగుడి కట్టడిలో బతికే దయనీయురాలి చుట్టూ నడుస్తుందిది. 'పెద్దమసీదు' అప్పారావుగారి కథల్లో అసంపూర్తి రచన. ఎత్తుగడను బట్టి ఈ విషయం స్పష్టమవుతున్నా నిలిచిపోయినంత మట్టుకుకూడా చక్కటి గల్పికలా సాగింది. సూక్ష్మగ్రహణం, సున్నితమైన పనితనం చూపించే అప్పారావుగారి కథలు తెలుగు వాఙ్మయంలో నిజంగా ఆణిముత్యాలే!

"౧౯౧౦ సంవత్సర ప్రాంతాలలో 'ఆంధ్రభారతి', ౧౯౧౪ లో 'త్రిలింగ' మాసపత్రిక, 'సువర్ణరేఖ' కథలు ప్రకటించినవి. 'మదరాసు కథలు' అనే సంపుటి

కూడా ఆ రోజులలోనే అచ్చుపడ్డది "౧౯౦౫ లో నేను 'ఆఖ్యాయిక' అనే సచిత్ర మాసపత్రిక తెనాలినుంచి ప్రకటించడానికి ప్రయత్నించాను. నా మిత్రులు కొంత మంది కథారచనకు కంకణము కట్టినారు." అన్నారు తల్లావఝుల శివశంకరశాస్త్రి గారు.* 1910 సంవత్సరంలో 'సాహితి' పత్రిక వెలువడ్డం మొదలైంది.

మాడపాటి హనుమంతరావు పంతులుగారు (1885) రాసిన 'మల్లికాగుచ్ఛము' కథల సంపుటి ఆ కాలంలోనే వెలువడింది 'హృదయశల్యము, ముసలిదాని యుసురు, నేనే, అగ్నిగుండము' మొదలైనవి మొత్తం పదమూడు కథలు ఈయన రచించారు.

పై ఉపపత్తులవల్ల, తెలుగు కథావాఙ్మయ చరిత్రలో 1910 సంవత్సరం ఒక సరిహద్దుగా నిలుస్తుందని చెప్పాలి. అంతకు ముందు వెలువడ్డ కథలన్నీ విషయ ప్రాధాన్య మున్నవేకాని ప్రక్రియా ప్రాధాన్య మున్నవి కాకపోవడంవల్ల ఆధునికుల దృష్టిలో 'తెలుగు కథానిక' అన్నది 1910 లో పుట్టింది తరవాతి దశాబ్దాల్లో వెలువడే వేలకొద్దీ కథలకు ఒరవడి పెట్టింది అప్పారావుగారు అందించిన ఆ సంప్రదాయాన్ని అందుకొని తెలుగునాట సుప్రతిష్ఠితం చేసిన కథయిత లెందరో ఉన్నారు వాళ్లలో కొందరు పాశ్చాత్య సాహితీ సంప్రదాయాల్ని బాగా ఆకళించు కొన్నవాళ్ళుకూడా ఉన్నారు. కొందరు ఆ వాసనకూడా సోకకుండా అచ్చమైన తెలుగు కథల్ని అందించిన వాళ్లూ ఉన్నారు. వస్తువులోను, పాత్రచిత్రణలోను, కథన శిల్పంలోను, సంభాషణల్లోను, భాషలోను రకరకాల ప్రయోగాలు చేసినవాళ్ళు కూడా ఉన్నారు. ఒకపక్క, కొన్ని వందల కథలు రాసినవాళ్ళు కనిపిస్తూంటే మరోపక్క, అరడజనుకూడా లేకపోయినా అద్భుతమైన కథలు రాసినవాళ్ళూ ఉన్నారు. నానాటికీ పెరుగుతూ వస్తున్న పత్రికారచనావ్యాసంగం, రకరకాల మాస పత్రికలూ. దినపత్రికలూ, వారపత్రికలూ వగైరా వేలకొద్దీ కథలు ప్రచురించాయి. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, జాగృతి వంటి పత్రికలూ నవ్యసాహితీ సమితి వంటి సాహిత్య సంస్థలూ పోటీలు పెట్టి ఔత్సాహికుల కెంతో ప్రోత్సాహ మిస్తున్నాయి. దేశికవితామండలి, ఆదర్శ గ్రంథమండలి, విశాలాంధ్ర ప్రచురణా లయం, నవోదయ, నవభారత్, యం. శేషాచలం అండ్ కంపెనీ, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి వంటి ప్రచురణ సంస్థలు వాటిని వెలుగులోకి తెస్తున్నాయి.

* భారతి, సెప్టెంబరు 1939.

తెలుగులో కథానికా వాఙ్మయాన్ని సంపన్నంచేసిన రచయితలు కొన్ని వందల మంది ఉన్నారు. ప్రకృత ప్రణాళికకు కట్టుబడి, కొందరి కృషి గురించి మనవి చేస్తాను. వీరిలో కొన్ని వందల కథలు పుంఖాను పుఖంగా రాసినవాళ్ళూ ఉన్నారు , పట్టుమని పదికిమించి రాయకపోయినా అద్భుత కళానైపుణ్యం చూపించిన చిరస్మరణీయులూ ఉన్నారు అంతవరకూ ఎందుకు? కనీసం ఒక్కటయినా మంచికథ రాసినవాళ్ళు అనేకులు అగుపిస్తూ ఉంటారు. వాళ్లలో కొందరికి గుర్తింపు వస్తుంది , కొందరు అలానే మరుగున పడిపోతారు. అయితే కథారచనా వ్యాసంగానికి సంబంధించినంతవరకు అందరూ అభినందనీయులే ; అందరూ స్మరణీయులే. కాని వాళ్ళందరి కృషిని గురించి, ఆయా కథలగురించి సర్వసంపూర్ణంగా పరిశీలించడ మన్నది ఒక వ్యక్తితో జరిగే పనికాదు ఒక సందర్భంలో జరిగేది అంతకంటె కాదు. అందువల్ల సమాచారం లభ్యమైనంత మేరకు పరిచయం చెయ్యవలసి వస్తుంది. అన్నిటి పరిచయభాగ్యం పొందకపోవడం వల్లగాని, సమయానికి స్ఫురించకపోవడం వల్లగాని, సమాచారం అందుబాటులో లేకపోవడంవల్లగాని కొందరి కృషిని గురించి ప్రస్తావించక లేకపోతే ఈ వ్యాసకర్త క్షంతవ్యుడు. అంతేకాని వారిని చిన్నచూపు చూడటం మాత్రం కాదని గ్రహించవలసినదిగా పాఠకులకు విన్నవిస్తున్నాను

కందుకూరి వీరేశలింగం పంతులుగారి (1848) శిష్యులు, ఆ కాలపు సాహితీ వేత్తల్లో సుప్రసిద్ధులు అయిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు (1867) ఒకరు. ఆయన 'రాజస్థాన కథావళి' అన్న పేరుతో కొన్ని కథలు వెలువరించారు. భాష గ్రాంధికమైనా ప్రసన్నంగా చెప్పే నేర్పు ఆయన సొమ్ము. పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు (1865) కథావల్లరి, కథాలహరి' వంటి సంపుటాలేకాక 'భారతి' లోను, 'ఆంధ్రపత్రిక' లోను కొన్ని కథలు ప్రచురించారు. 'సాక్షి' సంపుటాల్లో కొన్ని కథలు రాశారు. మొత్తంమీద 'రామరాజు, కానుగుచెట్టు, హరిభక్తురాలి వైభవము' వంటి కథలు పంతులుగారికి కథకులుగా ప్రతిష్ఠతెచ్చాయి వేంకట పార్వతీశ్వర కవుల్లో ఒకరైన బాలాంత్రపు వేంకటరావుగారు (1881) 'చిత్రకథా సుధాలహరి' రచించారు. రూపనగుడి నారాయణరావుగారు (1885) 'పరిణయ కథామంజరి, కథామణి ప్రవాళ ముక్తావళి (మూడు భాగాలు)' రాశారు

చింతా దీక్షితులుగారు (1891) తెలుగుకథ తొలినాళ్లలో రోచకమైన రచనలు చేసిన కథకుడు. 'దాసరిపాట, కిష్కింధలో కోతి, అభిప్రాయభేదం, గోదావరి నవ్వింది, చెంచురాణి, మొదటి బహుమానం' వంటి చక్కటి కథలు

రచించారు. ఆయన సృష్టించిన 'సూరీ సీతీ వెంకీ' ఎందరినో అలరించిన పాత్రలు. వ్యావహారికం ఒడుపులు తెలిసిన ఉత్తమశిల్పి ఈయన. తెలుగు కథకుల్లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి (1891 దొక విశిష్ట మూర్తిమత్వం జీవిత విధానంలో ఆయనకు ఎన్ని పట్టుదలలున్నాయో రచనా విధానంలో కూడా అన్ని పట్టుదలలున్నాయి. కథావస్తువు తెలుగుజీవితంలోదే ఉండాలి భాష వ్యవహారికంలోనే ఉండాలి కథన పద్ధతి స్వతంత్రంగా ఉండాలి ఆంగ్ల సాహిత్య పద్ధతులతో ఆయనకు నిమిత్తంలేదు. హిందీ అంటే అసలే పడదుకదా ! ఇక ఆయన చేసిన రచనలో తెలుగుతనంకాక మరొకటిచోటు చేసుకోడానికి వీలెక్కడిది ? అయన తనచుట్టూ ఉన్న పరిసరాల్నీ బాగా ఆకళించుకొన్నవాడు. అక్కడి జనజీవితాన్ని వెయ్యికళ్ళతో కనిపెట్టినవాడు ఆ జనం పలుకుబళ్ళకోసం చెవులు దోరబెట్టుకుని విన్నవాడు. ఇంత నిష్ఠగా తెలుగు కథను పండించిన రచయితలు చాలా అరుదు. శాస్త్రిగారి రచనల్లో ఎక్కువ భాగం కథలే. పైగా వాటి నన్నిటినీ చిన్న కథలని ఆయనే స్పష్టం చేశాడు. 'శుభికే ! శిర ఆరోహ, గులాబీ అత్తరు, కన్యాకాలేయత్నాద్వరితా, రాచపీనుగుతోడు లేకుండా వెళ్లదు, తల్లిప్రాణం, గుర్రప్పందాలు, అన్నంతపనీ జరిగింది, విమానం ఎక్కబోతూనూ, ఇల్లు పట్టిన విధవాడపడుచు, కీలెరిగినవాత, కలుపు మొక్కలు. గూడుమారిన కొత్తరికం, అరికాళ్లకింద మంటలు, వడ్లగింజలు, తాపీమేస్త్రి రాముదీక్షితులు బి. ఏ., మార్గదర్శి, ముళ్లచెట్టూ కమ్మని పువ్వూను, కూతుళ్లతల్లి మొదలైన కథలు శాస్త్రి గారి కథనంలోని ప్రత్యేకతకు అద్దం పడతాయి ఒక దృశ్యాన్ని కాని, ఒక చిత్తవృత్తినికాని ఎన్ని కోణాలనుంచి చూడ్డానికి వీలుంటుందో, ఎన్ని తీరులుగా ప్రదర్శించడానికి అవకాశముంటుందో అన్ని రకాలుగానూ విసుగెత్తించకుండా చెప్పడం ఆయనకేచెల్లు. ఆయనవాడే మాటలు అన్నీ పామరులకు సైతం నిత్యం చెవిని పడుతూ ఉండేవే. వాక్యాలన్నీ సరళమైనవే. వాక్యానికొక పేరా రాయడం ఆయన అలవాటయినా ఒక దాంట్లోంచి మరొకటి ఊడిపట్టుంటుంది. అచ్చులో చూస్తే ఆయన కథలన్నీ పెద్దగానే కనిపిస్తాయి. వందపేజీలు దాటిన కథలు కూడా ఉన్నాయి. అయితే ప్రతికథలోనూ అంతస్సూత్రం తెగకుండా సాగడం వల్ల వీటిని కథానికలుగానే ఎంచాలి. ఉదాహరణకు, 'వడ్లగింజలు' కథలో తంగిరాల శంకరప్ప జీవికకోసం బయలుదేరి చదరంగంలో తనకుగల ప్రావీణ్యంతో మహారాజావారి మెప్పు పొందడానికి చేయవలసిన ప్రయత్నాలన్నీ చెడి చివరికి

విజయం సాధిస్తాడు. దానికి పారితోషికంగా, రాజావారు ఏది ఇస్తామన్నా కాదనక, చదరంగం బల్లకున్న అరవైనాలుగు గళ్ళలోనూ-మొదట గడిలో ఒక వడ్లగింజ, రెండోగడిలో దానికి రెట్టింపు, మూడో గడిలో దానికి రెట్టింపు చొప్పున లెక్క-గట్టించి ఇప్పించమంటాడు. అతను కోరిన ప్రకారం ఇయ్యాలంటే రాజావారి రాజ్యానికే ముప్పు వస్తుందిమరి! 'మార్గదర్శి' అన్న కథలో, ఉద్యోగంకోసం తరిమిట్లుపడే యువకుడొకడు ఒక పెద్దమనిషి దగ్గిరికి సాయంకోసం వస్తాడు. అప్పుడా పెద్దమనిషి, తాను ఆ స్థితికి రావటానికి స్వతంత్రమార్గం అవలంబించి ఎలాపైకి వచ్చిందీ చెప్తాడు ఉద్యోగంలో దొరికే నాలుగు రాళ్లకోసం నానా అగచాట్లూపడుతూ ఊడిగం చెయ్యడంకంటె ఉత్తమమైన మార్గాన్ని అనుసరించమని హితవు చెప్తాడు అయినా వినకపోతివో, నీ ఖర్మం నువ్వే అనుభవించమంటాడు. జీవికకోసం స్వతంత్రవృత్తిని అవలంబించడంలో కలిగే అనుభవాలు, థ్రిల్, పట్టుదలా ఎలాఉంటాయో ఈ కథ స్పష్టం చేస్తుంది. ఇందులో ఇంకో విశేషముంది. కథనమంతా సంభాషణ రూపములోనే ఉంటుంది. అది కూడా రెండు పాత్రల మధ్యకాదు-ఒకేపాత్ర, అంటే అ పెద్దమనిషి చెప్పడమే ఉంటుంది. యవ్వనంలోనే మాంగల్యం కోల్పోయిన స్త్రీల మనస్సుల్లో కోరికలు ఎలా రేగుతుంటాయో, సాటి వారి కోరికల్ని అణచడానికి వాళ్లు ఎన్నిరకాలుగా ప్రయత్నిస్తూ ఉంటారో చాలా సహజంగా నిరూపించిన కథ 'ఇల్లుపట్టిన విధవాడపడుచు'. 'తాపీమేస్త్రి రామ దీక్షితులు, బి. ఏ,' కథ భేషజాలకుపోయే తల్లులకు గట్టిచురక. ఈ మాదిరిగా శాస్త్రిగారు రాసిన కథలన్నీ తెలుగు కథాసాహిత్యంలో విశిష్టత చేకూర్చుకున్నాయి.

కవికొండల వేంకటరావుగారు (1892) కవిగా సుపరిచితులు. వీరు 'సుమనోహ్లాదిని' అన్న పేరుతో ఒక కథలసంపుటి వెలువరించారు. వేంకటరావుగారు పామర జనజీవనంలోని తీరుతెన్నులను సైతం నిశితంగా చూడగల నేర్పరి. వీరి 'కంఠధ్వని' ఎన్నదగ్గకథ. వేలూరి శివరామశాస్త్రి (1892) గారిది బహుముఖ వ్యక్తిత్వం. సాహిత్యంలో నయితేనేం, శాస్త్రవిజ్ఞానంలో నయితేనేం అత్యాధునిక విషయాన్ని సైతం ఆకళించుకొన్న వ్యుత్పన్నులు. శరత్‌బాబు రచనల్ని ప్రప్రథమంగా తెలుగులో అందించిన సాహితీ హృదయమర్మజ్ఞులు 'తన్మయత, పిత్తల్‌కా దర్వాజా, డిప్రెషన్‌చెంబు'వంటి కథలు రచించి కథయితల్లో అగ్రశ్రేణిలోనిలిచినవారు. ప్రియురాలిపట్ల ప్రణయం, ఇష్టదైవంపట్ల భక్తిగా ఎలా పర్యవసిస్తుందో చక్కగా నిరూపించే కథ 'తన్మయత'. ఇందులో భాషా భావమూ కూడా అతి

ప్రౌఢమైనవి. నాయికానాయకుల ప్రేమ ప్రవాహానికి అడ్డంకు లేర్పడటం, కథ విషాదాంతం కావడం జరుగుతాయి. 'పీతల్‌కా దర్వాజా'లో పాత్రోచితభాష, భావనాబలం అద్భుతమైనవి తెలివిగల వాడికి లేమికి భయపడే పనిలేదని చాటి చెప్పేకథ ఇది. అలాగే శాస్త్రిగారి రచనానైపుణ్యానికి తార్కాణంగానిలిచే మరోకథ 'డిప్రెషన్‌చెంబు'. చక్కని తెలుగు కథలు అందించిన ఆడపడుచుల్లో కాంచనపల్లి కనకాంబగారు (1893) మొదటి తరంవారు 'రాధ' అనే కథ, 'చక్కనికథలు' అనే కథల సంపుటం వెలువరించారు

మొక్కపాటి నరసింహశాస్త్రి (1892) గారి పేరు చెప్పగానే మనకు గుర్తొచ్చేది 'బారిష్టరు పార్వతీశం'. కాని, హాస్యంమాట ఏమయినా ఆర్ద్రమైన కథలూ, చక్కటి శిల్పమున్న కథలూ వెలువరించిన సంగతి ఈ తరంవాళ్ళకి అంతగా తెలియకపోవచ్చు. 'చిత్రం, గత్యంతరం, లక్ష్మి, భిక్షువు, మహత్తు, శిల్పిద్వయం, చావుతెలివి' మొదలైనవి శాస్త్రిగారికథలు 'పిలక' అనే హాస్యప్రధానమైన స్కెచ్ వీరి తొలిరచన. ఆ రోజుల్లో ఇది విశేష జనాదరణ పొందింది. 'లక్ష్మి' భారతి పత్రిక పుట్టకముందే రాశారు, కాని భారతిలో అచ్చయింది. ఇది సామాన్యమయిన సాంసారికకథ. 'మహత్తు' అనే కథలో ఆకాలపు మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబాలలో ఉండే ఒకరకం జీవితాన్ని ప్రదర్శించినారు. 'చిత్రం' కథ 'సఖి'లో వచ్చింది. అప్పుడు దాని పేరు 'చిత్తరువు' ఇందులో ఒక చిత్రపటం కొన్నికొన్ని సందర్భాల్లో సజీవంగా కనబడి, సంక్షుభితమైన భర్త మనస్సుకు సవ్యమయినమార్గం స్ఫురింపజేసినట్టు రాశారు. ఆస్కార్‌వైల్డ్ 'పిక్చర్ ఆఫ్ డోరియన్' ప్రభావం దీనిమీద ఎంతమాత్రంలేదనీ, ఇది స్వతంత్రంగా కలిగిన ఊహేననీ శాస్త్రిగారు స్పష్టంచేశారు. ఏమయినా ఇదొక చక్కటికథ. 'భిక్షువు' అసాధారణమైన కథ. ఇందులో ఒక ఓషధికి గల ప్రభావాన్ని చక్కగా ఉపయోగించుకున్నారు. ఇటు వంటివి ఉండడానికి అవకాశాలున్నాయా లేవా అన్న సంశయం కలిగినప్పటికీ ఓషధి శాస్త్రజ్ఞులు దీన్ని సమర్థించారు. మతవైషమ్యంవల్ల అనాలోచితంగా "చెల రేగే విద్వేషం కారణంచేసుకొని, దాన్ని నిర్హేతుకంగా పెంచుకొని, తన జీవితం వ్యర్థమూ నరకమూచేసుకొని, తన విద్యవల్ల ఎంతహోదా, ఎంతధనం సంపాదించినా దానిని అనుభవించలేక, సద్వినియోగం చేసుకొనలేక, యత్కించిద్భోగమూ అనుభవించలేక ఎవరిమీదనో కక్ష సాధించవలెననుకొనిచేసిన ప్రయత్నంలో తన శత్రువనుకొన్న మనిషి ఎదుటపడినప్పుడు తనతనిమీద పగ తీర్చుకొందామనే

క్షణంలో, విపరీతమైన ఉద్రేకంలో తను స్పృహ తెలియకపడిపోయినప్పుడు, ఆ శత్రువనుకొన్నవాడే తనెవరో తెలియకపోయినా తనను ఆదరించి యింటికి తీసుకు వెళ్ళి వైద్యసహాయంచేయించి అప్పటికి ప్రాణంనిల్పిన మనిషి, తనకు శత్రువు కాడనీ, తాను యిన్నాళ్ళూ అనుభవించిన నరకమునకతడు కారకుడు కాడనీ తన మనస్సే తన శత్రువనే నిశ్చితజ్ఞానం, తనకు ఆఖరు క్షణంలో కలిగిన చావు తెలివి అని తెలుసుకొని జీవితంలో యే ఒక్క క్షణంలోనూ యెరుగని ప్రశాంతతతో సంతోషముతో తనువు చాలించిన ఒక అమాయకుని విషాదగాథ" అద్భుతమైన వస్తువు నెన్నుకుని అత్యంతసమర్థంగా నిర్వహించినశాస్త్రిగారు ధన్యులు.

మొక్కపాటివారి వియ్యంకులు, సాహితీసమితి పీఠాధిపతులు, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి (ఇప్పుడు స్వామీశివశంకరస్వామి గారు. వీరు 'మురారికథలు' రచించినవారు, అనేకమంది వర్ధమానకథకులకు ఆ రోజుల్లో, కవులకిచ్చినట్లుగానే ఎంతో ప్రోత్సాహమిచ్చినవారు. వీరు తలపెట్టిన 'ఆఖ్యాయిక' పత్రిక ప్రచురణ ఫలించకపోయినా సాహితీపత్రిక ఆలోటు తీర్చింది

గుడిపాటి వెంకటచలం (1894) గారు ఆధునిక తెలుగు సాహిత్యంలో అసదృశుడు. అయన కలానికి ఉన్న వాడి, వేడి అపూర్వమైనవి. స్త్రీపురుష సంబంధాలపట్ల, కుటుంబజీవనం పట్ల కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలు గలవాడు. తాను సత్యమని నమ్మినదాన్ని కుండ బద్దలుకొట్టినట్టు చెప్పగల ధైర్యశాలి. సొంత అభిరుచులు, ఆకాంక్షలు వ్యక్తంచేసుకోడానికి, శరీరవాంఛతీర్చుకోడానికి సమాజంలో స్త్రీకిగల అవరోధాలనన్నిటినీ ఆయన ఎదిరించాడు. స్త్రీ అయినా, పురుషుడయినా వ్యక్తిత్వ వికాసంకోసం చేసే ప్రయత్నా లన్నింటినీ సమర్థించాడు. పైకి నీతులు వల్లిస్తూ లోపల నీచాలకు ఒడిగట్టే మాయదారి మనుషుల బండారం బట్టబయలు చేశాడు. తనకు నచ్చినది ఇతరులకు ఎంత విడ్డూరంగా అనిపించినా ఆచరణలో చూపించాడు. నిరీశ్వరవాదిగా సాగి ఈశ్వరాశీస్సులకోసం రమణాశ్రమంలో స్థిరపడ్డాడు. 'స్త్రీ, బిడ్డల శిక్షణ'వంటి శాస్త్రీయ గ్రంథాలతోబాటు ఉమర్ ఖయ్యాం రుబాయీల అనువాదం, జీసస్ చరిత్ర వంటివి కూడా రచించాడు. 'మైదానం' వంటి నవలల్లాగే చలంగారి కథలు బహుజనాదరణ నందుకున్నాయి.

'ఆ రాత్రి' అన్న సంపుటంలో 'ఆ రాత్రి, ఆరంభించరు..., పాపఫలాలు, రామభక్తుడు, అప్పుడూ ఇప్పుడూ 'మొదలైనకథలు, 'వివాహం' అన్నదాంట్లో

'వివాహం, తరుణల చిత్తంబు, కళ్యాణి' అన్నకథలువచ్చాయి. 'సీతతల్లి' జెలసీ. ఆమె పెదవులు, దెయ్యమేనా, అభినవ సారంగధరుడు. మణి, లిల్లీతో స్నేహం ఎలా అయిందంటే సరస్వతీ ప్రసన్నం, ఒరేయ్ వెంకటచలం' అన్న కథలు మరో సంపుటంలో వచ్చాయి. 'దోషగుణం' 'చమత్కారమైనకథ' 'ఓ పువ్వు పూసింది' పేరుకు కథే అయినా చలంగారి కవితాత్మను ప్రదర్శిస్తుంది హాస్యం, అధిక్షేపం సమపాళ్ళలో కలిపి శృంగారానికి జోడించిన రసజ్ఞుడు చలం. ఆయన రచనల్ని ఒక పక్క కొందరు బూతులబుంగలని ఈసడిస్తున్నా అనేకులు వాటిని ఆదరించారు. చెప్పదలచుకొన్న విషయాన్ని ఆయన చెప్పినంత పవర్‌ఫుల్‌గా, సూటిగా చెప్పగలిగినవాళ్ళు మరొకరులేరు. వాదప్రతివాదాల్లో ఆయన దిట్ట ఆయన చెప్పిన అభిప్రాయాలతో అనేకులు ఏకీభవించలేకపోవచ్చు కాని, ఆయన విష యమై అప్పటికీ ఇప్పటికీ చెప్పుకొనేది ఒక్కటుంది-అది ఆయన చిత్తశుద్ధి!

ఈ శతాబ్దంలో కలంపట్టిన సాహితీవేత్తల్లో సమున్నత స్థానంలో నిలిచిన బహుముఖ ప్రజ్ఞాశాలి విశ్వనాథ సత్యనారాయణగారు (1895). తెలుగు సాహిత్య ప్రక్రియల్లో ఆయన కృషి చేయనిదేదీ లేదు. 'భారతీయ జ్ఞానపీఠం' వారు లక్ష రూపాయల బహుమాన మిచ్చింది శ్రీమద్రామాయణ కల్పవృక్షానికే కాదు, ఆయన అసదృశ మూర్తిమత్వానికి; తద్వారా తెలుగుభాష సుసంపన్నతకు!

సత్యనారాయణగారు రాసినకథలు 'చిన్నకథలు' అన్న పేరుతో ఒక సంపు టంగా వెలువడ్డాయి. వాటిలో 'నీఋణం తీర్చుకున్నా. య్యోర్షిష్ఠిఖెయ్, ఏమి సంబంధం మాక్లీదుర్గంలో కుక్క' మొదలైన కథలున్నాయి. 'నీ ఋణం తీర్చు కున్నా' అన్నకథ ఆర్ద్రత కలిగించే కథ. ఇందులో రెండు సంఘటన లున్నాయి. వెంకటేశ్వర్రావు కొడుకును సూర్యనారాయణ దంపతులు పెంచడం, ఆ కుర్రవాడు చనిపోవడం, వాడి శవాన్ని సూర్యనారాయణే శ్మశానికి తీసుకువెళ్లడం మొదటి సంఘటన. ఇది వెంకటేశ్వరరావుకు బాధ కలిగించింది. తరువాత సూర్యనారాయణ క్కూడా కొడుకుపుట్టాడు. వెంకటేశ్వర్రావు దంపతులే వాణ్ణి సరిగాచూడడం, సూర్యనారాయణ సరిగా చూడలేకపోవడం జరిగింది. చివరికి ఆ కుర్రవాడూ చనిపోయాడు. ఈసారి ఈ కుర్రవాడి శవాన్ని వెంకటేశ్వర్రావు శ్మశానానికి తీసుకెళ్ల వలసి వచ్చింది. ఈ విధంగా సూర్యనారాయణ, వెంకటేశ్వర్రావుల ఋణం తీరిపోయింది. గుండెను పిండేకథ!

విశ్వనాథ ఈడువాడే అడివి బాపిరాజుగారు (1895). చిత్రకళ, కవిత్వం, సంగీతం, కథాకథనం ఒక్కచోట కుదురుకొన్న కళామూర్తి. అంతకంటె మిన్నగా చెప్పదగ్గది ఆయన సౌశీల్యం. స్నేహానికీ సౌహార్దానికీ ఆయన ఇచ్చిన విలువ గొప్పది. ఆయనతో కలిసిమెలగడం ఒక గొప్ప అనుభూతిగా భావించారు ఆయన సమకాలికులు ఏ ఊహాలోకంలోనో తిరుగాడుతూ తెలుగునాట కన్నువిప్పిన గంధర్వపురుషు డనిపిస్తాడాయన. 'శశికళ' ఆయన కలలను పండించిన కాల్పనిక కాంత ఒక బొమ్మవేసినా, పాటపాడినా, కథచెప్పినా దాన్ని సర్వసంపూర్ణమైన కళాఖండంగా తీర్చిదిద్దడం బాపిరాజుగారి వైశిష్ట్యం. 'లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా, ఉప్పొంగిపోయింది గోదావరి, మరచిపోవబోకె బాల, మరచిపోవకే!' మొదలైన గీతాలు తెలుగుదేశంలో ఎందరినోళ్లలో ఆడేవో చెప్పలేం తెలుగు కళ, తెలుగు సంస్కృతి, తెలుగు జనజీవనం ఆయనకు ఎంత అభిమాన పాత్రమైనవో ఆయన రచనల్లో అంతటా స్పష్టమవుతుంది

ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు నిర్వహించిన నవలల పోటీలో 'వేయి పడగలు' రాసిన విశ్వనాథతోబాటు బహుమానంలో పాలుపంచుకొన్నవారు బాపిరాజుగారు. వీరి నవల పేరు 'నారాయణరావు'. ఈ శతాబ్ది తొలినాళ్ళలో సంపన్నకుటుంబాల జీవనాన్ని కళ్లకు కట్టినట్టుంటుంది ఈ నవలలో. ఇదికాక 'తుపాను, కోనంగి, గోనగన్నారెడ్డి' మొదలైనవి బాపిరాజుగారి నవలలు. ఈయన నవలలన్నీ పెద్ద కాన్వాస్‌మీద రాసిన చిత్రాలయితే ఈయన కథలు మీనియేచర్ కళాఖండాలని చెప్పవచ్చు. 'వసుబాలుడు, భోగీరలోయ, వీణ' మొదలైన కథలే అందుకు నిదర్శనాలు. వసుబాలుడు కథకు రాయలవారి కాలం కథారంగం. బాపిరాజుగారి వర్ణనలకు 'వీణ' కథ మచ్చుతునక. ఈయన మాదిరిగా, సౌందర్య మూర్తులనూ కళాపిపాసులను ప్రధాన పాత్రలుగా తీర్చిదిద్ది రచనలు చేసినవాళ్ళు చాలా అరుదు. స్నేహితుల హృదయాల్లో ఈయన 'బాపిబావ' గా నిలిచిపోతే పాఠకుల హృదయాల్లో కళాతపస్విగా నిలిచిపోతాడు.

తెలంగాణా సాహిత్యక్షేత్రంలో సుమేరుశృంగంగా నిలిచినవారు సురవరం ప్రతాపరెడ్డిగారు (1896). వీరి పేరు వినగానే మొట్టమొదట గుర్తుకు వచ్చేది 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'. ఆయన మరణానంతరం, దీనికి కేంద్ర సాహిత్య అకాడమీవారి జాతీయ బహుమానం లభించింది ; ఇతర భాషల్లోకికూడా అనువాద మైంది. దీంతోబాటు 'రామాయణ విశేషములు, హిందువుల పండుగలు' రెడ్డిగారి

పరిశోధన పాటవానికి, పరిశీలన నైశిత్యానికి గీటురాళ్ళు. వృత్తికోసం న్యాయవాదం చదివినా ప్రవృత్తివల్ల న్యాయవాదిగా నిలిచినవాడాయన. ఆర్ద్రహృదయుడు, సౌమ్యభాషి, గాఢప్రతిభుడు సత్యనిరూపణ చెయ్యవలసి వచ్చినప్పుడు ఈయన ఎంత నిర్భీకంగా రాస్తాడో వివిధ పత్రికల సంపాదకత్వంలోను, వ్యాసరచనలోను చూపిన విమర్శలే సాక్ష్యాలు.

ఇతర ప్రక్రియల్లోలాగే కథా రచనలోకూడా అందెవేసిన చెయ్యి అనిపించు కొన్నవారు ప్రతాపరెడ్డిగారు. ఈయనకు కథకుడుగా శాశ్వతకీర్తి తెచ్చింది 'నిరీక్షణ'. వివిధ కథా సంకలనాల్లో చోటు చేసుకోడమే కాకుండా హిందీ, ఉర్దూ, పార్సీ, కన్నడ, మహారాష్ట్ర భాషల్లోకి కూడా అనూదితమైందంటే దీని ప్రశస్తి ఎంతటిదో గ్రహించవచ్చు 'నిరీక్షణ' లో శంకరన్, కుమారి బావామరదళ్ళు. ఒకరిమీద ఒకరికి గాఢమైన అనురాగముంది. పెళ్ళిచేసుకొని తాము కన్న కలల్ని పండించుకోవాలని చూస్తారు ఈ ప్రేమికులు. అయితే ఒకనాడు సముద్రంలో చేపలు పట్టడానికి వెళ్ళిన శంకరన్, ఎన్నటికీ తిరిగి రాకపోయేసరికి కుమారి గుండె విలవిల్లాడి పోతుంది అతనిరాకకోసం, అలా సముద్రంవైపే ఎదురుచూస్తూ నలభై ఏళ్ళు గడుపుతుంది. చివరికి అతన్ని స్మరిస్తూనే ప్రాణాలు విడుస్తుంది. గాఢమైన ప్రేమ గూడుకట్టుకున్న ముద్దరాలి నిరీక్షణకిది పరాకాష్ఠ హృదయావర్జకమైన కథ ఇది. కన్యాకుమారి చరిత్ర ఈ కథ రాయడానికి స్ఫూర్తి నిచ్చినట్లు రెడ్డిగారే చెప్పుకున్నారు.

ఇదికాక, 'బారిస్టరు గోపాల్‌కిషన్‌రావు, చంద్రయ్య భీమా, పెండ్లిబేరము, వింతవిడాకులు' రెడ్డిగారికథలలో కొన్ని. వాటిలో పన్నెండు కథల్ని ఉత్తమమైన విగా ఎన్నికచేసుకొని ఫైలులో పెట్టుకున్నారు రెడ్డిగారు. ఈ కథలకు ప్రేరణ ఇచ్చి నది సమకాలిక జనజీవనం. ఆనాడు తెలంగాణాలో విస్తృతంగా ఉన్న వెట్టి చాకిరీ, జనుల మూఢాచారాలు, అధికారుల దుండగాలు ముప్పిరిగొన్నకాలమది. వాటిని కథల్లో చిత్రించడానికి ఆయనచేసిన ప్రయత్నం ఫలించింది. పాఠకుల వినో దార్థం 'మొగలాయికథలు' అన్న పేరుతో 'గోలకొండపత్రిక'లో రెడ్డిగారు రాస్తూ వచ్చిన కథలు కొన్ని బాగా ప్రచారం పొందాయి. వీటిలో మొదటికథ 'గ్యారా కద్దూ బారా కొత్వాలు' అన్నది. తొలిసారిగా 1931లో గోలకొండపత్రికలో ప్రచు రించిన ఈ కథ, తరవాత 'భారతి'లోకూడా వచ్చింది మొత్తం పదకొండుకథలు రెండు భాగాలుగా వచ్చాయి. 'బేఖూఫ్ మదార్‌సాబ్, బంగారుగాడిద, గోమాజీ

గజేట్ పీతల్‌దర్వాజా, కిచిడీజాగీరు భేతాళసుల్తానుల భేటీ, చస్తామంటే పురసతు లేదు, ఫకీరుబిడ్డ, రుమాలను బ్రెతినిపోయింది మొదలైనవి వాటిలో కొన్ని ఆ రోజుల్లో ముస్లిమ్ అధికారుల్లో ప్రబలంగాఉన్న లంచగొండితనం, అధికారదర్పంతో వాళ్ళు చేస్తుండే దుండగాలు, వాళ్ళలో కొందరు ప్రదర్శించే మూర్ఖత్వంరెడ్డిగారి వ్యంగ్యతనంతో కథలుగా రూపొందాయి. పాత్రల స్వరూప స్వభావచిత్రణచేసిన తర వాత సన్నివేశ చిత్రణ చెయ్యడంరెడ్డిగారి అలవాటు సూటిగానాటుకొనే అధిక్షేపం కొంత, హాస్యంకొంత ఆయన కథల్ని ఆకర్షకంగా చేశాయి. 'న్యాయదీక్ష, ప్యారీ సవారీ, సత్యవాదిబుద్ధూ' మొదలైనవిరెడ్డిగారి అధిక్షేప పద్ధతికి ఉదాహరణలు.*

ఆయన భాషాశైలి చాలా సరళమైనది పదరూపాల్లో గ్రాంధిక వ్యావహారి కాల సమ్మిశ్రణం చాలా కనబడుతుంది కాని కథలకు సంబంధించినంతవరకు వ్యావహారికానిదే పై చెయ్యి.

ప్రఖ్యాత కవిపండితులు అబ్బూరి రామకృష్ణారావుగారు (1896) 'సూర్య రాజు కథలు'రాశారు విఖ్యాత కవయిత్రి కనుపర్తివరలక్ష్మమ్మగారు (1896) 'బాలనీతికథావళి' అన్న సంపుటం మాత్రమేకాక 'మా వూరు, పెంచిన ప్రేమ, ఒట్టు' మొదలైన కథలురాశారు. ఈనాటి సభ్యతాలక్షణాలు కొన్ని ఎంత అప హాస్యంగా ఉంటుంటాయో, ఎంత నిర్దాక్షిణ్యంగా దారితీస్తాయో నిరూపించేకథ 'ఒట్టు'. ఈమె పరిశీలనాశక్తి నిశితమైనది; పలుకుబడి రమ్యమైనది; కథాకథనం అత్యంతాకర్షకమైనది. డాక్టర్ విశుపాటి వెంకటరమణయ్యగారు (1896) నవ్వు పుట్టించే 'నాయనమ్మకథలు' రచించారు. నవ్వు అనగానే మనస్సులో మెదిలే ఇద్దరు పెద్దలు భమిడిపాటికామేశ్వరరావుగారు, మునిమాణిక్యం నరసింహారావుగారు. కామేశ్వరరావుగారి కథన పద్ధతి 'అద్దెకొంపలు'వంటి వ్యాసాల్లో నిక్షిప్తమైంది.

మునిమాణిక్యం నరసింహారావుగారు (1898) దాంపత్య జీవితంలోని అందచందాల్ని అత్యంతరమ్యంగా ప్రదర్శించిన కళాకారుడు. అంతేకాదు; ఆనాడు మహోధృతంగా చెలరేగుతున్న చలంగారి ప్రభావానికి ఆనకట్టకట్టిన ప్రజ్ఞాశాలి. స్త్రీపురుషులు కోరుకునే ప్రేమ, సౌఖ్యం అందుకోడానికి ఎక్కడికో పోవక్కర్లేదు, నేర్పుగా అందుకునే వాడికది ఇంట్లోనే లభ్యమవుతుంది అని నిరూపించినవాడు. అందుకు ఆలంబనగా ఆయన సృష్టించినపాత్ర 'కాంతం'. కాంతం కల్పితపాత్ర

* శ్రీ ఇ. శివారెడ్డి, 'సురవరం ప్రతాపరెడ్డిగారి జీవితము-సాహిత్యము.'

అంటే తెలుగువాళ్ళు నమ్మరు మన మెరిగిన ఇళ్ళలో ఎక్కడో అక్కడ తారస పడే ఇల్లాలేననిపిస్తుంది ఆవిడ నిజంగా ముని మాణిక్యంవారి భార్యే అనుకున్న వాళ్ళు కూడా లేకపోలేదు. ఇదంతా ఎందుకు చెప్పొచ్చేనంటే, నరసింహారావుగారు తీర్చి దిద్దిన కాంతం - అహ: అలాక్కాదు నరసింహారావుగారి రచనల్ని తీర్చి దిద్దిన కాంతం- అంత సహజంగా, అంత హుందాగా రూపొందడం, తెలుగు ఆడపడుచులందరికీ అల్లాటి పరేగింత జ్ఞానముంటే దాంపత్య జీవితాలు మరెంత రమ్యంగా ఉండేవో కదా , అనిపిస్తుంది. 'దాంపత్యోపనిషత్తు' ఒక్కటిచాలు, దానికి నిదర్శనం చూపించడానికి. 'దీక్షితులు, రుక్కుతల్లి' మినహా, తక్కినవన్నీ చక్కని చిన్నకథలు. 'వెండికంచం' చుట్టూ ఎంత అందమైన కథ నడిపారు! 'పిల్లలుగల ఇల్లు' ఎంత నందడిగా తీర్చిదిద్దారు! కాంతం ఎంత మాటకారి అయినా, కట్టెవిరిచి పొయిలో పెట్టినట్టు పలికిన సందర్భం ఒక్కటీ లేదు. పూల చెండుతో రొమ్మును తాకినట్టుండే బంతులాటలే కనిపిస్తాయి. 'భార్యలను లొంగదీసుకోడం ఎలా?, మనహాస్యము' అనే సిద్ధాంతగ్రంథాలు కూడా మునిమాణిక్యం వారి ప్రతిభకు అద్దంపట్టినా కాంతం పాత్రను సృష్టించిన నేర్పు ఒక్కటి చాలు, తెలుగు కథా వాఙ్మయంలో ఆయనకు చిరంజీవిత్వం సిద్ధించడానికి.

శ్రీనివాస శిరోమణిగారు (1899) వాల్మీకి రామాయణం అనువాదకులుగా తెలుగు పాఠకులకు సుపరిచితులు. జ్యోతిశ్శాస్త్రంలోనూ సంస్కృత సాహిత్యం లోనూ ఆయన గొప్ప పండితులన్న సంగతి, చక్కటి కథ లనేకం రాశారన్న సంగతి చాలా మందికి తెలియకపోవచ్చు. 'చంద్రేణైక పుత్రః' వంటి కథలు ఆయన కథనశక్తికి నిదర్శనాలు.

వెంపటి పురుషోత్తం (1899) గారు 'దేశకథా మంజరి' అన్న కథల సంపుటం వెలువరించారు. 'నారాయణభట్టు, మల్లారెడ్డి, కవిద్వయము, ధూర్జటి' వంటి చారిత్రక నవలలు రాసిన నోరి నరసింహశాస్త్రిగారు చక్కటి కథలు కూడా చాలా రాశారు

ఇరవయ్యో శతాబ్దారంభంలో జన్మించిన కథకుల్లో మొట్టమొదట చెప్పుకో దగ్గవారు 'కరుణకుమార' (కందుకూరి అనంతంగారు, 1901). కింది తరగతి శ్రమజీవుల కథల్ని అత్యంత సహజంగా. రమ్యంగా తీర్చిదిద్దిన రచయిత ఈయన 'సన్నజీవాలు' అన్న సంపుటంలో 'టార్చిలైటు, రిక్షావాలా, 512, పశువుల

కొరం, కయ్య-కాలవ, బిళ్ళల మొలతాడు' మొదలైన కథలు చూడవచ్చు. 'ఆకలిమంటలు' అన్న కథలో సరోజిని, కూరగాయలవాళ్ళతో గీసిగీసి చేసే బేరాలు రక్తిగా ఉండడమేకాక ఆ పాత్ర ప్రధానశీలాన్ని మనకు ఇట్టేపట్టి ఇస్తాయి. రానురాను ఆమె పొదుపరితనం పిసినిగొట్టుతనంగా భాసించినా దానికి అట్టడుగున ఉన్న జాలిగుండె మనకు ప్రత్యక్ష మవుతుంది. సమాజాన్ని జాగ్రత్తగా పరిశీలించి అత్యంత సహజంగా చక్కటి కథలు రాయగల కొద్దిమందిలో 'కరుణకుమార' ఒకరు. ఆయన గతించి చాలా కాలమైనా ఆయన కథలు చిరకాలం నిలుస్తాయన డానికి నిదర్శనం ఇప్పటికీ ఆ కథలకుగల డిమాండు.

శిష్టా వెంకట సుబ్బయ్యగారు (1901) 'షట్క-థామంజరి' అన్న పేరుతో కొన్ని కథలు ప్రచురించారు. సర్వా-వేంకట శేషయ్యగారు (1901) 'పంచతంత్ర హితోపదేశ కథామంజరి, పుణ్యశ్లోకులు' రచించారు. సూరాబత్తుల సుబ్రహ్మణ్యం గారు (1903) 'చైనా జపాన్ కథలు' అన్న పేరుతో ఆంగ్లంనుంచి కొన్ని కథల అనువదించారు. 'సాగుతున్నయాత్ర' రాసిన ఆచంట జానకిరామ్‌గారు 'తోటమాలి వంటి సున్నితమైన కథలు కూడా రచించారు.

నేటి వృద్ధతరం సాహితీవేత్తల్లో పురివండా అప్పలస్వామిగారు (1904 ఒకరు. ఇంగ్లీషు, ఒరియా భాషాల్లో కూడా వీరికి ప్రావీణ్యముంది 'విశ్వకథా వీథి అన్నపేరుతో కొన్నికథలు ఆరు భాగాలుగా ప్రచురించారు. మక్సీమ్ గోర్కీ రాసిన 'మదర్' నవలను అనువదించిన ప్రఖ్యాత రాజకీయవేత్త, పత్రికా రచయిత క్రొవ్విడి లింగరాజుగారు (1904) 'గాపోళ్ల న్యాయం' అన్నపేరుతో కొన్ని కథల రాశారు, పాలంకి వెంకట సూర్యనారాయణ మూర్తిగారు (1904) 'చిత్రకథ మంజరి' వెలువరించారు.

'పుష్పకవిమానం'వంటి కొన్ని వందల కథలు రాయడమేకాక 'పూలతోట వంటి పత్రికలు కూడా నడిపి లబ్ధప్రతిష్ఠులైనవారు పూడిపెద్ది వెంకట రమణయ్య గారు.

తెలుగు కథాసాహిత్యంలో తనదైన శైలి నొకదాన్ని ఏర్పరుచుకుని అం మైన తెలుగు కథలు చెప్పిన విశిష్టులు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు (1905 వీరి కథాసంపుటాలు పదికి పైచిలుకు ఉన్నాయి. 'స్వరమేళ, చెంగల్వ రసమంజరి, వనమాల, రవిచంద్రిక, సర్వమంగళ, దోదమ్మి, అల్లోనేరేడు

మొదలైనవి 'స్వరమేళ' సంపుటంలోవి 'వెలది వెన్నెల, ఏలేలో, సోహం, గంగా లహరి, గోరంతగొప్ప; వీటిలో ఏలేలో, సోహం గంగాలహరి ఈ మూడూ లంకెకథలు. గతిస్తున్న తరంలోని రసరమ్య జీవితానికి అద్దంపట్టడంలో రామకృష్ణ శాస్త్రిగారు అందవేసినచెయ్యి ఈయన భావుకతకు తగ్గ పలుకుబడి, పలుకుబడికి తగ్గ ఉరవడి రచనకు జీవంపోస్తాయి. 'రంగవల్లి, మునిగోరింట, మత్తకోకిల, కామునిపున్నమి' ఎందరు పాఠకుల్ని అలరించాయో ఈనాటి యువతరానికి అంతగా తెలియకపోవచ్చు విద్యాసంపత్తి, సరసత్వం, వాక్చమత్కృతిగల 'తాత' గారి పాత్ర శాస్త్రిగారి సృష్టి. పల్లెపట్టుల్లో పుట్టి పెరిగినవాళ్లు కనక శాస్త్రిగారి కథలు చదువుతూంటే, చిన్నప్పుడెప్పుడో అల్లాటి తాతగార్నీ ఆయన చుట్టూ మసిలే ఇతర పాత్రల్నీ చూసినట్టే అనిపిస్తుంది. శాస్త్రిగారి ఫక్కీ శాస్త్రిగారిదే కాని మరొకళ్లకి రానేరాదు : ఈయన రచన అనువాదానికి లొంగేరకంకాదు. ఈయన బలుకుబడిలోని అందచందాలు చదివి ఆనందించే అదృష్టం ఒక్క తెలుగు వాళ్లకే దక్కుతుంది. ఈ విధంగా ప్రత్యేకత సంతరించుకొన్న మరొక రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

టేకుమళ్ల కామేశ్వరరావుగారు (1907) 'రోజా' అన్న కథల సంపుటి వెలువరించారు. 'ఆత్మీయత' వంటి కథలద్వారా అందే నారాయణస్వామిగారు (1907) సుపరిచితులైనారు. చక్రపాణిగారు (1908) 'అహం బ్రహ్మాస్మి' వంటి కథలు రాశారు ; అనువాదాలు ప్రచురించారు ; పత్రికలు సంపాదించారు ; చలనచిత్రాలు రూపుకట్టించారు. సరళమైన భాషాశైలి, ఇంపైన వాక్యవిన్యాసం నార్ల వెంకటేశ్వరరావు (1908) గారి సొత్తు. 'ఆంధ్రప్రభ' సంపాదకులుగా కొంత కాలం, 'ఆంధ్రజ్యోతి' సంపాదకులుగా అనంతర కాలంలోను పేరెన్నికగని ఇప్పటికీ అనేక గ్రంథాలు అవలోడనచేస్తూ అనేక రచనలు కావిస్తూ ఉండే సాహితీ పిపాసి. 'కొత్తగడ్డ, జగన్నాటకం, మాటామంతీ, నార్లవారిమాట, జాబాలి' ఆయన కలం వేంచి వెలువడ్డవే. 'సభ్యత' వంటి కథలు ఎన్నికైనవి కొమ్మూరి పద్మావతీ దేవిగారు (1909) ఆతరం రచయిత్రులలో సుప్రసిద్ధి నందినవారు. 'పొగడదండ' అన్న కథలకూర్పు ఈమె కృషిఫలితం

తెలుగు కథకుల్లో కొడవటిగంటి కుటుంబరావుగారు (1908) చేసిన కృషి విస్తృతమైనది ఆయన కథలు అసంఖ్యాకమైనవి. వస్తువులోను, సంవిధానంలోను దృక్పథంలోను ఆయన తెచ్చిన మార్పులు తెలుగు కథను పరిపుష్టం చేశాయి.

నిరాడంబరమైన శైలి, మధ్య తరగతి జీవుల మంచిచెడ్డల చిత్రీకరణ, కొంత హాస్యపుపాలు, మరికొంత ఆధిక్షేపం ఈయనల్లో విశేషంగా కనిపిస్తాయి 'కవి రాట్టు, నిలవనీరు, ఆడజన్మ, నువ్వులూ తెలకపిండీ, ఫాలౌట్, కొత్త జీవితం, చంద్రోదయం, లేచిపోయిన మనిషి, ఎక్కడైనా ఒకటే, ఒంటిస్తంభం మేడ, పెళ్ళి-వ్యవహారం'—ఇలా మొదలు పెడితే కొన్ని వందల కథలు లెక్కకు వస్తాయి. ఈయన పాత్రలు నేలమీదే నడుస్తాయి; మంచిచెడ్డల తెలుగు నీడల్లో తారట్లాడ తాయి వాటి పరిసరాలనవి నిశితంగా చూసుకొంటాయి. తర్జనభర్జనలు చేస్తాయి. జీవంతో తొణికిసలాడుతుంటాయి

కథాకథనంలో కుటుంబరావుగారిలో కనిపించే సారళ్య సౌలభ్యం అపు రూపమైనవి. శిల్పాల జల్పాలు ఆయన కిట్టవు. చెప్పేది సూటిగా పాఠకుడి మనస్సులో జొరబడ్డమే ఆయనకు కావలసింది. అందులో కృతార్థుడు కావడం ఆయనలో విశేషం తెలుగుకథ పురోగతికి కుటుంబరావుగారిచ్చిన తోడ్పాటు గణనీయమైనది. "కథారచనలో ఆయన చేయని ప్రయోగంలేదు ఆయన కలంలో సిరా ఇంకా ఇంకిపోలేదు."

అంబటిపూడి వెంకరత్నం (1908) గారు 'వీరాంజలి' అన్న కథల సంపుటి వెలువరించారు. కవిగా, గేయరచయితగా ప్రసిద్ధులైన వింజమూరి శివరామరావు గారు (1908) 'మపాసా కథలను, 'గోర్కీ కథల'ను తెలుగులోకి అనువ దించారు సహదేవ సూర్యప్రకాశరావు (1908) గారి కథలు 'ఆరాధన' సంపు టంగా వెలువడ్డాయి.

కొనకళ్ల వెంకటరత్నం (1909) గారి పేరు చెప్పగానే చటుక్కున స్ఫురించేవి 'బంగారుమామ పాటలు'. కాని 'అతని కరాడు' వంటి చక్కటి కథలు కూడా రాసిన సంగతి కొందరైనా ఎలామరిచి పోగలరు? వీరి కథల సంపుటం పేరు 'కథావళి'. బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు పేరు మోసిన న్యాయవాదిగా, ప్రభుత్వంవారి అడ్వొకేట్-జనరల్‌గా ప్రసిద్ధులు 'జేబురుమాలు, ప్యారిస్'వంటి అద్భుతమైన కథలు కూడా ఈయన రాశారు. తెలుగునాట అభ్యుదయ కవితోద్య మానికి ప్రధాన నాయకుడుగా-ఇప్పుడు విప్లవ కవితోద్యమనాయకుడుగా-అనదృశ మైన ప్రభావం ప్రసరింపజేసిన శ్రీరంగం శ్రీనివాసరావు (1910) గారు కథా రచనలో కూడా నేర్పుచూపించారు. 'చరమరాత్రి' సంపుటం అందుకు ఉదాహరణ.

పాలంకి వెంకట రామచంద్రమూర్తి (1910) గారు బాల సాహిత్యాన్ని పెంపొందించిన వారిలో ఒకరు 'చిత్రకథామంజరి. వింతబీరువాలు, నేతిరొట్టెలు, పండుగబట్టలు' మొ వి ఈయన రచనలు. చాలా చిన్న విషయాన్ని తీసుకొని దానిచుట్టూ కథ అల్లడంలో ఈయనకు గొప్ప నేర్పు ఉంది 'కథాసాగరం' సంపుటాల్లో ఈయన కథల సంపుటం కూడా వెలువడింది. 'వెధవడబ్బు' అన్నకద బాగుంటుంది దిగుమర్తి సీతారామారావుగారు (1910 'సీత-రాదమ్మ, భామ' అన్న కథాసంపుటాలు వెలువరించారు



1901-1910 మధ్యకాలంలో పుట్టిన కథకుల్లో గొప్పవాళ్ళను నలుగుర్ని చెప్పమంటే స్ఫురించే పేర్లు-'కరుణకుమార', మల్లాది రామకృష్ణశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్ ! తెలుగు కథానిక స్వరూపస్వభావాల పరిణామ వికాసాలకు వీరి కృషి ఎంతగానో తోడ్పడింది.



త్రిపురనేని గోపీచంద్ (1910) గారు నిశితపరిశీలకుడు. జిజ్ఞాసాపరుడు, గొప్పమానవతావాది అసంఖ్యాకమైన ఈ కథల్లో అనేకం ప్రాచుర్యాన్ని పొందాయి వాటిలో సుప్రసిద్ధమైనకథ 'ధర్మవడ్డీ'. వడ్డీ వ్యాపారంచేసి మూటగట్టిన ఒక షావుకారు చివరికి ఉన్మాదస్థితికి రావడానికి పరిస్థితులు ఎలా దారితీశాయో గోపీచంద్ చక్కగా చిత్రించారు. 'భార్యల్లోనే ఉంది, భార్యాభర్తలు, తండ్రులూ కొడుకులూ' వంటి వాటితోబాటు, ఈనాడు పత్రికల్లో వచ్చే జోక్స్‌లాంటి చిట్టి కతలు, 'నేనూ-నాపాత్రా, పెద్దల సుద్దులు' వంటివి కూడా రాశారు, ఆర్థిక, రాజకీయ సాంఘిక, సాంసారిక సమస్యలు నేటి మధ్యతరగతివాడి జీవితాన్ని ఎన్ని తీరులుగా ప్రభావితం చేస్తాయో ఈయన కథల్లో ఆచ్చుగుద్దినట్టు అగుపిస్తాయి.



ఈ శతాబ్ది రెండో దశకంలో జన్మించిన వారిలో చెప్పుకోదగ్గ కథకులు యాభైమంది వరకు ఉన్నారు. పిలకా గణపతిశాస్త్రి (1911) గారు 'ప్రాచీనగాథా లహరి' మూడు సంపుటాలుగా ప్రచురించారు. ఇవికాక 'గాంభీర్యం', ఇతర కథలు కూడా రచించారు. కథానికా లక్షణ నిరూపకుడుగానేకాక చక్కటి కధానికా రచయితగా కూడా పేరు గడించినవారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. వీరి కథలు 'విజయదశమి, హనుమచ్ఛాస్త్రి కథలు వంటి సంపుటాల్లో వచ్చాయి. 'వివాహమంగళం' కథ ఎంత హాయిగా సాగుతుందని !

గుమ్మళ్ల వేంకటేశ్వరరావు (1911) 'గృహసీమ' అన్న కదల సంపుటం వెలువరించారు. బొడ్డు బాపిరాజుగారు (1912)'కలిక' ప్రచురించారు. 'ఆషామాషీ, పడగక్ష' వంటి ఫీచర్లతోను 'బాటసారి, నెలవంక' వంటి నవలలతోను పేరెన్నిక గన్న రావూరి సత్యనారాయణరావు (1913) గారు 'మధుపర్కాలు'వంటి ముచ్చటయిన కథలు కూడా రాశారు. సున్నితమైన హాస్యాన్ని అందించడంలో ఈయన అందెవేసిన చెయ్యి. సంవత్సరాది వచ్చిందంటే 'సాహిత్య సింహావలోకనం'తో ఎదురొచ్చే శ్రీవాత్సవ(యండమూరి సత్యనారాయణరావు)గారు(1913)'కోడెత్రాచు' వంటి కథలు కూడా రచించారు. సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు తెలుగు హాస్య రచయితల్లో సుప్రసిద్ధులు. ఈయనరాసిన నాటకాలనేకం తెలుగు నాటకరంగాన్ని ఎంతోకాలం రంజింపజేశాయి. 'ఎర్రచేపు'వంటి వ్యాసాలు, 'బీడీమారకం'లాటి కథలూ శాస్త్రిగారి పరిశీలనా శక్తికీ, రచనా సామర్థ్యానికీ నిదర్శనాలు.

డా॥ జి. వి. కృష్ణారావు (1914)గారు సాహిత్యశిల్ప మర్మజ్ఞుల్లో ప్రత్యేకత గలవారు. ఈయన రాసిన 'ప్లేటో ఆదర్శరాజ్యం, జేగంటలు, 'Studies in Kalapurnodayamu' వంటి అనువాద, వ్యాఖ్యాగ్రంథాలూ 'కీలుబొమ్మలు' నవల తెలుగు సాహితీవేత్తలకూ సాహిత్యాభిమానులకు ఆదరపాత్రమైనాయి. వాటికితోడు 'ఉదబిందువులు'వంటి కథలు కూడా డా॥ రావుగారికి పేరు తెచ్చాయి.

'నా గొడవ' కాళోజి, ఖలీల్ జిబ్రాన్ అనువాదకుడు (జీవనగీత) కాళోజి, అన్యాయం కంటబడితే నిప్పులుకక్కే కాళోజి, న్యాయాన్ని ఔదలదాల్చినప్పుడు జైలుకైనా వెళ్లడానికి సిద్ధపడే కాళోజి, వెన్నవంటి మనస్సును కన్నీటిలో కనబరిచే కాళోజి కథకుడుగా కూడా కలాన్ని నడిపించాడు. ఈయన కథలు 'కాళోజికథలు' అన్న పేరుతో ఒక సంపుటంగా వెలువడ్డాయి. కథకుడుగా ఈయన నిలవడానికి 'లంకా పునరుద్ధణ' ఒక్కటిచాలు. కృత్తివాస తీర్థులు (1914) ప్రసిద్ధ సాహితీవేత్త అయిన తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారి కుమారుడు ఈయన కథాసరిత్సాగరాన్ని 6 భాగాలుగా సంస్కృతంలోంచి అనువదించారు కొడవటిగంటి కృష్ణమూర్తి (1914) గారు 'మాలో మేము, బీరకాయపీచు' వంటి కథల సంపుటాలు ప్రచురించారు.

విశ్వసాహిత్య రంగంలో తెలుగువాళ్ల పేరు ఉన్నతంగా నిలిపిన ఉత్తమ కథకుడు పాలగుమ్మి పద్మరాజుగారు (1915). 1952 ప్రాంతంలో 'న్యూయార్క్

హెరాల్డ్ ట్రిబ్యూన్' పత్రిక వారు ప్రపంచవ్యాప్తంగా నిర్వహించిన కథల పోటీలో ఈయన రాసిన 'గాలివాన' ద్వితీయ బహుమాన మందుకుంది

'గాలివాన' ప్రవర్తనవాదం (బిహేవియరిజం) మీద ఆధారపడ్డ కథ అని చెప్తారు. జీవన విధానంలో కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలూ అలవాట్లూ ఏర్ప రుచుకుని దానికి కట్టుబడి నడిచే రావుగారు రైల్లో ప్రయాణంచేస్తూ ఉంటారు. విపరీతంగా గాలివాన వస్తుంది. ప్రయాణం ప్రమాదకరంగా పరిణమించడంవల్ల ఒక చిన్నస్టేషన్‌లో రైలు ఆగిపోతుంది. రావుగారు రైల్లోంచిదిగి, స్టేషన్‌లో వెయిటింగ్‌రూమ్‌లో విశ్రాంతి తీసుకుందామని వెళ్తాడు. ఇలా అక్కడ ఉండగా అక్కడ మరో మనిషి అలికిడి అవుతుంది. ఆ మనిషి, అంతకుముందు తనకు తారసపడ్డ ముష్టిదేనని గుర్తిస్తాడు. గాలివాన, చలి ! ఆయన భావాలు రకరకాలుగా సాగుతుంటాయి. ముష్టిది చలిబాధకు తట్టుకోలేక దగ్గరికి వస్తుంది రావుగారి ఆలోచనలన్నీ బందయిపోతాయి. తానుమరింత చేరువవుతాడు. తెలతెలవారు తూండగా ప్లాట్‌ఫారంమీదికి వస్తాడు. ఆ ముష్టిది ప్రమాదవశాత్తు అక్కడ చచ్చి పడి ఉంటుంది ఆమె చేతిలో ఆయన పర్సు ఉంటుంది ! అందులోని తనపేరున్న కాయితం తీసేసి ఆయన సాగిపోతాడు ఇదీ కథ. రచనా శిల్పంలో పద్మరాజు గారు గొప్పనేర్పు చూపించారు. ఇది ప్రపంచంలో నాగరికభాష లన్నిటిలోకీ అను వాదమైంది.

'గాలివాన'కు అంతర్జాతీయ బహుమానంద్వారా గుర్తింపువస్తే వస్తు ప్రాధాన్యం, రచనా శిల్పంద్వారా పేరువచ్చిన గొప్పకథ 'పడవప్రయాణం.' ఇందులో 'రంగి' విశిష్టమైన పాత్ర. దొంగ, తాగుబోతు, వ్యభిచారి, ఉద్ధతుడు అయిన ప్రియుడు ఉత్తప్పుడు ఎంతబాధపెట్టినా, ఎంత అన్యాయంచేసినా, వాడు మనసుపడి వచ్చినప్పుడు ఎంత అభిమానం చూపిస్తాడో తలుచుకుని, వాడికోసం ఎన్ని బాధలయినా అనుభవించడానికి సిద్ధపడే చిత్రమైనపాత్ర రంగి. ఇది భార తీయ భాషల్లోకేకాక రష్యన్, చెక్ దేశభాషల్లోకికూడా అనువాదమయింది.

'బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా, ముత్యాలమనసు' మొదలైనకథలు రాసిన వారు ఇల్లిందల సరస్వతీదేవిగారు (1915). పాతికేళ్ళకుపూర్వం 'పండుగ బహు మానం' అన్న కథలసంపుటి ఒకటి ప్రచురించారీమె. తరవాతకూడా వివిధ పత్రి కల్లో కథలు ప్రచురిస్తున్నారు. ఆధునిక సాహిత్య ప్రాచుర్యంకోసం అహరహం

పనిచేసిన తపస్వి వట్టికోట ఆళ్వారుస్వామి (1915) గారు. 'జైలులోపల' అన్నది ఈయన కథాసంపుటి జైలులోమగ్గుతున్న బందీల జీవితాల్లోని దయనీయగాథలకు జీవంపోసినవారు స్వామిగారు. తాము జైలులో ఉన్నప్పటి అనుభవాన్ని ఈ విధంగా సద్వినియోగంచేసుకున్నారు. వీటిలో ఆరుకు ఆరుకథలూ పాఠకుల్ని ఆకట్టుకొనే కథలు. కడుపుమంట చల్లార్చుకోడానికి పరిగెకట్టె దొంగిలించి జైలులో పడ్డవాడి జాలికథ 'పరిగె'. అతను తిరిగివచ్చేసరికి తండ్రి మరణిస్తాడు, చెల్లెలు పరారి అవుతుంది, ఇల్లు పాడుపడిపోతుంది. నేరాలుచేసి పశ్చాత్తాపంచెంది జైలుగోడల మధ్యనుంచి బయటపడాలని ఆరాటంచెందేవాడికథ 'పతితుని హృదయం.' 'విధిలేక' అన్నకథలో జైలుకువెళ్ళిన నర్సయ్య భార్య ఆకలి బాధకు తట్టుకోలేక వేరేపెళ్ళి చేసుకుంటుంది. ఈ మాదిరిగా బరువుగుండెల బాధలను కళ్ళకుకట్టినట్టు చిత్రించారు ఆళ్వారుస్వామిగారు గోవాడ నిరీక్షణరావు (1915) గారు 'కథాలోకం' అన్న సంపుటికి కర్త.

స్త్రీ పురుషుల మనస్తత్వాల్నీ, ప్రవర్తనల్నీ అత్యంతసూక్ష్మంగా పరిశీలించి రమ్యమైన రసవత్కథలు కల్పించినవారు బుచ్చిబాబు (శివరాజు వెంకటసుబ్బారావు) గారు (1916). 'చివరకు మిగిలేది' అన్ననవలా, కొన్ని నాటికలూ నాటకాలూ విమర్శగ్రంథాలూ రాసినా ఈయన ప్రధానంగా కథకుడు అందులోనూ గొప్పభావుకుడు స్వతహా కళాకారుడు కావడంవల్లనేమో, ఈయన వర్ణనలు చాలా అందంగా ఒరిజినల్‌గా ఉంటాయి. ఒక్కొక్కప్పుడవి కవిత్వం అంచుల్ని అందుకుంటూ ఉంటాయి. వాటికితోడు కథనశిల్పం అద్భుతంగా ఉంటుంది; అడపా తడపా హాస్యం వెల్లివిరుస్తూ ఉంటుంది. 'చైతన్యస్రవంతి' అన్నకథ ఇంగ్లీషులో వచ్చిన Stream of consciousness ఫక్కీకి తెలుగు ప్రయోగం. ఫుట్‌నోట్స్ చూసుకుంటేనేకాని దాన్ని అర్థంచేసుకోడం అంతసులువుకాదు. 'ఆమెనీడ, నా గాజు మేడ, కాలచక్రం నిలిచింది, మూడు కోతులు, అడవికాచిన వెన్నెల, రసన్స్రెల్, కంకితమైన రెండు కథలు' మొదలైనవి ఈయనరాసిన కథల సంపుటాలు. 'దేశం నా కిచ్చిన సందేశం' అన్నది ఎంత బాగుంటుంది! దీన్ని ఆయనే ఇంగ్లీషులోకి అనువదించగా ఇలస్ట్రేటెడ్ వీక్లీ ప్రచురించింది. 'నన్ను గురించికథ వ్రాయావూ?' అన్నది గుండెను కదిపే కథ. మొత్తానికి బుచ్చిబాబు మాదిరిగా మనస్తత్వ పరిశీలనను అంత రమ్యంగా ప్రొంచింది కథలు రాసినవాళ్ళు తెలుగులో అరుదు.

'ఎవరికివారేనా, మాణిక్యం, ఋణవిముక్తి, తుంగభద్ర పొంగింది'వంటివి రాసిన ఉత్తమకధకులు కప్పగంతుల సత్యనారాయణగారు (1916). గోర్కీకదలు, చెఖోవ్‌కధలూ ఆంగ్లంలోంచి అనువదించినవారు ప్రయాగకోదండరామశాస్త్రిగారు (1916). నరహరి నరసింహారావు (1916) గారు టాగూరుకధల్ని ఆంగ్లంలోంచి అనువదించారు, అట్లాగే కొన్ని అమెరికన్ కథల్నికూడా తర్జుమాచేశారు. 'ఉర్దూ కధానికలు' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకోసం అనువదించినవారు బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు.

'వెల్లువలో పూచికపుల్లలు, యుగసంధి' వంటి నవలలద్వారానేకాక 'ఇజ్జత్' వంటి కథలద్వారా ఆధునిక సాహిత్యంలో నిలదొక్కుకున్నవాడు భాస్కరభట్ల కృష్ణారావుగారు (1918). ప్రాణంపోయినా మానం పోవడానికి సహించని బడుగు వాడి బలమైనకధ 'ఇజ్జత్' విద్వాన్ మల్లాది సత్యనారాయణగారు 'జీవితమాధుర్యం' లాటికథలు వ్రాశారు. శిష్టేతర జానపదమాండలికంలో చిక్కటికథలు రాసి ఖ్యాతిని పెంచుకొన్న కధకుడు, కళాకారుడు మాధవపెద్ది గోఖలేగారు. వీరిపేరు చెప్పగానే స్ఫురించేది 'బల్లకట్టుపాపయ్య'కధ ఈ పేరే ఉన్న సంపుటంలో ఇదికాక ఇంకా, 'మూగజీవాలు, శివరేత్రి తిరణాళకు, అభిమానం, పాలెంలోబొమ్మలాట' అన్న కథలున్నాయి వీటిద్వారా గుంటూరు జానపదమాండలికానికి గ్రంథస్థమయ్యే అదృష్టంపట్టింది. 'వెలుగునీడలు' అన్నకథలసంపుటి పిల్లలమర్రి వెంకట హను మంతరావుగారు (1918) రాసింది. కళాకారుడుగా, కళావ్యాఖ్యాతగా ప్రసిద్ధుడైన సంజీవదేవ్, 'ప్రొఫెసర్‌భార్య'లాటి కధలుకూడా రాశారు. పి. వి. సుబ్బారావుగారు (1918) 'స్మారకసభ' మొదలైన కధలు రాశారు.

తెలుగువాళ్ళకు పన్యాలరంగనాథరావు (1919) గారి కంఠస్వరం రేడియో వార్తలద్వారా అభిమానపాత్రమైతే ఆయన కలంబలం 'తెలుగు స్వతంత్ర' వంటి పత్రికలద్వారా తెలియవచ్చింది. 'అమాయకత్వం, నరకుని కోరిక' వంటివి వీరి కథల్లో ఎన్నదగ్గవి. సెక్స్ పత్రికలతో ముడిపడ్డ ధనికొండ హనుమంతరావు (1919) గారిపేరు 'సత్యవ్రతుడు'లాటి చక్కని కధల్నికూడా గుర్తుచెయ్యక మానదు వి. యస్. అవధానిగారు (1919) 'జ్యేష్ఠుడు'వంటి కధలు రాసినవారు.

'జమదగ్ని' అన్నపేరుతో కొద్దిపాటి అయినా దొడ్డకథలు రాసినవారు చెరుకుపల్లి జమదగ్నిశర్మ (1920) గారు 'చిలకాగోరింకా, అన్నదమ్ములు, మరపు

రా? ఆవూరు, బళ్ళోకి వెళ్ళాలి' అన్నకథల్లో శిల్పవైశిష్ట్యం ఏ రచయితకయినా చిరప్రతిష్ఠ చేకూర్చేది. నోరులేని మూగజీవాల్ని ఆలంబనగా తీసుకొని మానవ ప్రవర్తన మాలిన్యాన్ని అధిక్షేపించగల చక్కటి కథలు 'చిలకాగోరింకా, అన్నదమ్ములు', 'యామాసామాయా' ఎంత చిత్రమైన కథ !

ప్రఖ్యాత అనువాదకుడు, సినీరచయిత అయిన మద్దిపట్ల సూరిగారు (1920) 'పాపికొండలు' అన్న కథల సంపుటి వెలువరించారు. ఇటీవల కీర్తిశేషులైన అంగర వెంకటకృష్ణారావు (-1920) గారు ఎప్పటికీ మరవరాని కథలో నవలలూ రాశారు. 'తొగరుచెట్లు, మూడుతరాలు' ఆయనవి. వేలూరి సహజానంద (హసజ) (1920) గారు సూక్ష్మపరిశీలన, మనస్తత్వ అవగాహన, రచనా సారళ్యమూ ఉన్న కథకుడు. 'జీవిక' వంటి కథలే ఇందుకు నిదర్శనం. కొత్త లక్ష్మీరఘురామ్ (1920) గారు 'బంధము' వంటి కథలు రచించారు.

అదశాబ్ది మలుపుతిరిగే సరికి, మనకు కనిపించే సాహిత్యవేత్తల్లో కథలు అనేకమంది ఉన్నారు. వాళ్లలో కొత్తకొత్త ప్రయోగాలు చేసినవాళ్లు, తీరుతెన్నులు నిరూపించినవాళ్లు, తెలుగు కథానిక వికసనానికీ విలసనానికీ తోడ్పడ్డవాళ్లు ఎందరో ఉన్నారు. నిజానికి, వాళ్లందరి కృషినీ యథోచితంగా సమీక్షించ బూనుకుంటే ఈ చోటు ఇరకాటమయిపోతుంది కనుక సంగ్రహపరిచయమే ప్రస్తుత కర్తవ్యం.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు (1921) 'ధర్మనిర్ణయం, తిక్కన' లాటి నవలలే కాక కొన్ని కథలుకూడా ప్రచురించారు. ఎన్. ఆర్. చందూర్‌గారు (1921) 'దరఖాస్తులు' లాటి కథలు రాశారు దాసరిసుబ్రహ్మణ్యంగారు (1921) 'ముందుచూపు' మొ. కథలు రాశారు. దేవరకొండ బాలగంగాధర తిలక్ (1921) గారు కవిగానేకాదు, కథకుడుగా కూడా లబ్ధప్రతిష్ఠుడు. 'ఊరిచివరి ఇల్లు, నల్లజెర్ల రోడ్డు, నవ్వు' వంటి చక్కటి కథలు రాశారు. కవిత్వాన్నీ కథనీ ఇల్లా జోడు గుర్రాల బండిలా నడపగల దక్షులు తక్కువ.

రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు (1922) కథకుల కథకుడు ; ప్రతిభావంతుడు ; ప్రభావంతమైన కథలు రాసినవాడు. 'కథాసాగరం-13' సంపుటంలో వచ్చిన కథలు- 'ఆఖరిదశ, విలువలు, కోర్టుకురాని సాక్షులు, కార్నరుసీటు, కిటికీ, జరీఅంచు తెల్లచీర, ఇద్దరు పిల్లలు' మొదలైన కథలు ఇరవై ఏళ్ల క్రితమే పేరు తెచ్చుకున్నాయి. తరవాత వచ్చిన 'ఆరు సారా కథలూ, ఆరు సారో కథలూ,

శ్రీ శ్రీ కథలూ' మొదలైన వాటి సంగతి ప్రత్యేకంగా చెప్పనే అక్కర్లేదు. సామాజిక స్పృహ, సమకాలికత, శిల్పకల్పన ఈయనలో విశిష్టమైనవి. దగాపడ్డ తమ్ముళ్లూ చెల్లెళ్లూ ఈయన కథల్లో చైతన్యం పుంజుకుంటారు. చిట్టిపొట్టి వాక్యాలతో ఎంత శక్తిమంతమైన కథలు రాయవచ్చో ఈయన కదలే నిరూపిస్తాయి. ఈయనలా కథలు రాయాలని సాధన చేసే రచయితలు తెలుగుదేశంలో చాలా మంది ఉన్నారంటే ఆశ్చర్యంలేదు

'తూలికాభూషణ్' పేరుతో రాస్తూండే బుద్ధవరపు చినకామరాజుగారు (1922) 'ఋణానుబంధం, బ్రతికిన దినాలు, లచ్చితల్లి, మెరీనాతీరే' వంటి అందమైన కథలురాశారు పంతుల శ్రీరామశాస్త్రి (1922) గారు 'కిల్లీదుకాణం, నాటకాంతం' వంటి కథలు రచించారు. 'కోర్టుమార్షల్, హిమగిరితనయే' మొ.వి రచించిన వారు క్రొవ్విడ లక్ష్మన్నగారు. 'అలసినగుండెలు' రాచమల్లు రామచంద్రారెడ్డిగారు (1922) ప్రగతిస్ఫురణంతోరాసిన కథలకు మచ్చుతునక. 'వైతాళికులు' సంకలనకర్త ముద్దుకృష్ణగారు 'కాలం కల్పించేమార్పు, పదిరూపాయల టికెట్' లాటి కథలు రాశారు. ప్రఖ్యాతకవి దాశరథి కృష్ణమాచార్యగారు 'స్వాతి చినుకులు' లాటివిరాసి కథలుగాకూడా గుర్తింపు పొందారు అనిసెట్టి సుబ్బారావుగారి (1922) కథలు 'అనిసెట్టికథలు' అన్న సంపుటంలోవచ్చాయి. సింగరాజు లింగమూర్తి (1922) గారు, 'సాలెగూడు, క్షమామూర్తులు, రెండు నాలుకలు' అన్న సంపుటులు వెలువరించారు. 'క్షమామూర్తులు' అన్న దాంట్లో వచ్చిన 'మేఘాలు-అరణ్యాలు-కళ్ళు', ఇటీవల వచ్చిన 'మట్టిదీపం' చాలా మంచికథలు

''వేళ్ళమీద లెక్కపెట్టవలసిన పదిమంది తెలుగు కథానికా రచయితలలో చాసో పేరు ఉంటుందని బహుభాషాకోవిదులు, ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యపారంగతులు అయిన శ్రీ రోణంకి అప్పలస్వామిగారు అభిప్రాయపడ్డారు.'' ఆ 'చాసో' అసలుపేరు చాగంటి సోమయాజులుగారు. 'వాయులీనం, ఎంపు, పరబ్రహ్మం, దుమ్ములగొండె, కుక్కుటేశ్వరము'వంటి అద్భుతమైన కథలు ఆయన రచనలు. వీటిలో గొప్ప వైవిధ్యముంది. ఒక్కొక్కకథ ఒక్కొక్కరకం భాషలో సాగుతూంటుంది.

'ఎర్రజెండాలు' అన్న సంపుటంలో 'నాగమ్మ'వంటి అతి వాస్తవికమైన కథలు చిత్రించిన కథకుడు గంగినేని వెంకటేశ్వరరావుగారు. పాతిక సంవత్స

రాలకు పూర్వం తెలంగాణా ప్రాంతంలోసాగిన సాయుధపోరాటం ఎన్ని రకాల దారుణ సంఘటన ఎదుర్కొన్నదో కళ్ళకు కట్టినట్టు చిత్రించిన గంగినేని అభినంద నీయుడు. ఆ రోజుల్లోనే ప్రగతిపథగామిగా ఆలోచనాత్మకమైనకథలు రాసిన వాళ్ళలో ప్రసిద్ధుడు మరొకడు 'జీవనప్రభాత'

ప్రాచీన అర్వాచీన సాహిత్యాలను మథించి ఉత్తమ పరిశోధకుడుగా నిలవ డానికి 'మనలిపి : పుట్టుపూర్వోత్తరాలు' అన్న పుస్తకం ఒక్కటేచాలు ననిపించు కొన్న ప్రసిద్ధ పండితుడు, పత్రికారచయిత, తిరుమల రామచంద్రగారు చక్కటి కథలుకూడా రాసిన సంగతి ఈ తరం వాళ్ళకి చాలామందికి తెలియదు 'గాథా సప్తశతి' ఆధారంగా రాసిన 'వాడని, వీడని మూడుకోణాలు' అన్న కథ ఆంధ్ర ప్రభ వారపత్రికలోను, రేడియోలోను వచ్చింది. 'అంపకాలు' 'వాణి' పత్రికలో వచ్చింది. బాపిరాజుగారు హైదరాబాదులో 'మీజాన్' పత్రికకు సంపాదకులుగా ఉండే రోజుల్లో, ఆయన ప్రోత్సాహంతోకూడా కొన్ని కథలు రాశారు. 'రూట్ మార్చ్, కోర్ట్‌మార్షల్' అన్నవి సైనిక జీవితాన్ని వస్తువుగా తీసుకొనిరాసినవి. అట్లాగే, 'మీజాన్'లో పనిచేసిన రాంభట్ల కృష్ణమూర్తిగారు (శశవిషాణం) కూడా రమ్యమైన కథలు కొన్ని రాశారు. 'వసుధ' పత్రికలోవచ్చిన 'ఒన్‌పాయింట్ ప్రోగ్రామ్' ఈయన రచనా నైశిత్యానికి మచ్చుతునక, 'వెంచాశా' (చావలి వెంకట శాస్త్రి) గారు, 'మసూనా' రెండు మూడు శతాబ్దాలుగా చక్కటి కథలు రాస్తున్న సిద్ధహస్తులు. 'గండిపడ్డ జీవితాలు' అన్న సంపుటిలోని కథలు, ప్రసిద్ధ పత్రికా రచయిత, వార్తాప్రసారకుడు పి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి కలంనుంచి వెలు వడ్డవి.

ఘండికోట బ్రహ్మాజీరావుగారు కథానికారచనపట్ల ప్రత్యేకకృషిచేస్తున్న రచయిత పీరికథల్లో ఇటీవల ప్రచురితమైంది 'విధివరించిన తీర్పు.' బొమ్మిరెడ్డి పల్లి సూర్యారావుగారు 'అమాయకులు మొదలైన కథలు రాశారు. పూషా (రంగడు వెంకటరమణమూర్తి)గారు గల్పికలు రాయడంలో సుప్రసిద్ధులు. 'సంజదీపం, సంజప్రణయం' ఈ విధమైన గల్పికలూ ప్రహేళికలూ కూర్చిన సంపుటాలు. ఇవి కాక 'ఇంటర్వ్యూ'వంటి కథలుకూడా రాశారు.

కాశీపట్నం రామారావుగారు రాసినకథలు సంఖ్యలో తక్కువే అయినా ఎక్కువకాలం మనస్సులో నిలిచిపోయేవి. 'చావు, భయం, యజ్ఞం' మొ వి.

ఈ కోవలోని ప్రసిద్ధకవి సోమసుందర్ కథారచనలోకూడా నిపుణుడు. ఈయన 'బానిసలదేశం'లోని కథలే అందుకు ఉదాహరణలు అలాగే ఆరుద్రగారు రాసినవి 'ఆరుద్రకథలు' అన్న సంపుటంలో వచ్చాయి-'ఊరు ఊరుకొంది, ఊష్ణమొస్తే బావుణ్ణు, చావక్రింది నీరు' మొ.వి

కథారచనలో రకరకాల ప్రయోగాలు చేసినవారు రావూరిభరద్వాజగారు వాటిపట్ల ప్రత్యేకాభిరుచి ఉండికూడా అసంఖ్యాకమైన కథలురాశారు. ఏ విధమైన గడిబిడీ గడబిడాలేని అందమైన తెలుగు శైలి ఆయనది గోడల్లేని జైలు, లక్క బొమ్మలు, ఈ డొచ్చిన కథ మొదలైనవి అందుకు ఉదాహరణలు. తెలుగు కథా సాహిత్యాన్ని వర్ధమానం చేసిన ప్రముఖులో భరద్వాజ ఒకరు. తెనాలివారే మరొక ప్రసిద్ధ రచయిత 'హితశ్రీ' (మతుకుమిల్లి వెంకటనృసింహ ప్రసాదరావుగారు. 'కాకిగూడు, అమ్మగారు - అయ్యగారు, పొడుగునీడలు' ఇలా చాలా కథలు గుర్తొస్తాయి.

మధురాంతకం రాజారాంగారు అచ్చం తెలుగుకథకోసమే పుట్టినరచయితలా కనిపిస్తాడు. ఆకథల వెనక ఆయన వ్యక్తిత్వం ఎంతో ఉన్నతంగా కనిపిస్తుంది. ఆయన నిండుకుండవంటివాడు, రచనకూడా అంత నిండుగానూ ఉంటుంది. ఆయన రాసిన కొన్ని వందల కథల్లో ఏ ఒక్కటి తీసినా రాజారాం ముద్రస్పష్టంగా కనిపిస్తుంది - 'కుంపట్లో కుసుమం, కాటుకకంటినీరు, తాను వెలిగించిన దీపాలు, సర్కసుడేరా, వగపేటికి చల్లచిందినన్' మొదలైన ఎన్ని లేవు ఆయనకు చిరప్రతిష్ఠ చేకూర్చినవి ?

అవసరాల రామకృష్ణారావుగారు శుభవార్త తెచ్చిన బంధువు లాంటివాడు. చెప్పినంతసేపూ చాలా హాయిగా, అందంగా చెప్తాడు. బోలెడు చమత్కారం, రవ్వంత వేళాకోళం పిటికెతగ్గ హాస్యం మిళాయించడంలో ఉంది ఈయననేర్పు. అలాగని బరువైన కథలు రాయకకాదు, కథలో కూడా బరువులు ఎత్తడం ఇష్టం లేక పిటికెతోడు జీవితసత్యాల్ని కళ్ళకుకట్టినట్టు ఆవిష్కరించే ఈ రచయిత తెలుగు వాళ్ళకి అత్యవసర కథకుడు కావడంలో ఆశ్చర్యమేముంది ? 'ఇనస్పెక్టరూ ఇంత వినరూ' ఏనాటికథ ! 'నాకు సర్వం నీకు నేనూ, ఎవడితోనైనా లేచి పోరాదూ ?,' సామాన్యుడూ సర్కారువారూ, గాంధీగారి ఖరీదు, నల్లపిల్లి' మొదలైనవి ఎన్నో మంచి కథలు ఆయనవి. 'ఐదురకాల ఆత్మహత్యలు'- దేనికదే బాగుంటుంది.

తాళ్ళూరు నాగేశ్వరరావుగారు అందమైన కథలు అవలీలగా రాసేరచయిత. అన్నీ కలిపి, ఈయన రాసినవి ఐదువందలకి తక్కువ ఉండవు 'మానవత్వం, గెజిటెడ్ ఆఫీసరు భార్య, మావూరికథలు, ప్రేమికుని అంతరంగిక ప్రపంచం, స్వామివారి సన్నిధిని' ఇలాటివి ఎన్నో పేర్కొనవచ్చు.

తెలుగు కథలద్వారా రమ్యమైన హాస్యాన్ని పండించిన రచయిత రవణ – అంటే ముళ్ళపూడి వెంకటరమణ. 'జనతా ఎక్స్‌ప్రెస్, మహరాజూ యువరాజూ, ఆకలి ఆనందరావూ, వేట, సాక్షి, కానుక', మొదలైనవి విరివిగా ఉన్నాయి. కన్నీటిలో కూడా పన్నీటిని రాల్చగల రచయిత ఈయన. 'కానుక' లాటి ఉదాత్తరచన ముళ్ళపూడి ముద్రకొక అపవాదం. రాజకీయ భేతాళ పంచవింశతి' ఈనాటి మన రాజకీయ రంగానికి అద్దం పట్టేరచన.

వ్యంగ్యానికి పెట్టిందిపేరు వాకాటి పాండురంగారావుగారు. 'ఆర్. చక్రా రావుకథ, పాముల నిచ్చెన, రెండు రెక్కలవాడు, బ్రతుకన్నది ఒకవరం, సుబ్బి, మనిషిచేసిన దేవుడు, అపరాజిత, సృష్టిలో తీయనిది' మొదలైనవి ఆయన రచనకు మచ్చుతునకలు. రంధి సోమరాజుగారు 'అమరుడు నీలూ!, నేనేమిచేశాను, ఉన్నతాశయాలు, ఈ మనిషి—ఈలోకం' వంటి చక్కటి కథలు రాశారు.

'నీలి' అనగానే చటుక్కున స్ఫురించేది –'మందు' కాదు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ అన్నపేరు. న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌వాళ్ళు నడిపిన రెండో ప్రపంచ కథానికల పోటీలో తెలుగులోంచి ఎన్నికయిన కథల్లో 'నీలి'కి మొదటి బహుమతివచ్చింది అంతకుముందూ తరవాతాకూడా శర్మగారు కథలు రాస్తూనే ఉన్నారు. దాసీపనిచేసే అవిటిపిల్లను గురించి రాసిన ఈ కథ శర్మగారికి ఎంతో పేరు తెచ్చింది. అలాగే, కోతి, సంసారం, సీతజడ మొదలైనకథలు ఎంతో బాగుంటాయి. రచనా సంవిధానంలో శ్రద్ధపట్టడమే ఇందుకు కారణం. ఈయన రచనలో నిశితమైన పరిశీలన కనిపిస్తుంది; చౌరమైన సంభాషణలు వినిపిస్తాయి; వ్యంగ్యం తొంగి చూస్తుంటుంది. మొత్తానికి, మంచికథ చదివామన్న తృప్తి కలుగు తుంది.

పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారి పేరు చెప్పగానే 'నీళ్లు, నిప్పు, ముసురు, మూగపిల్ల' ఇల్లా ఎన్నో కథలు మనస్సులో మెదుల్తాయి. 'నీళ్లు' ఎంత మంచికథ! నిజానికి, కృష్ణాగోదావరీ నదీతీరాల్లో ఉండేవాళ్లకి వాటి విలువ ఏంతెలుసు ? రాయల

సీమ మెట్టప్రాంతా లెరిగిన రాజారాంలాటి వాళ్లకి తెలుసు. కళ్ళముందు కనిపించే దాంతోబాటు దాని వెనక ఉన్నదికూడా చూపించగల నేర్పరి సుబ్బరామయ్యగారు.

'అర్ధానికి అటూ ఇటూ, ధర్మప్రభువు, సినిమాకథ, విపరీత రాజయోగం' లాంటి ఒరిజినల్ కథలూ, 'పతివ్రత, ఒప్పందం'లాటి (పెరల్‌బక్) అనువాద కథలూ రచించిన ఉత్తమ కథానికా శిల్పి 'కనక్‌ప్రవాసి' (చామర్తి కనకయ్య). ఈ ప్రక్రియలోని శిల్పంపట్ల ఈయనకున్న శ్రద్ధ మెచ్చుకోదగ్గది.

తెలుగు కథక చక్రవర్తి మల్లాది రామకృష్ణశాస్త్రిగారి మెప్పు, ప్రోత్సాహం పొందిన కథయిత్రి కళ్యాణ సుందరీ జగన్నాథ్‌గారు. 'అలరాసపుట్టిళ్లు' అన్నది ఆవిడే రాయగలిగిన అందమైనకథ. రాచవారి కట్టుబాట్లకు అంత సహజంగా అంత హుందాగారాయగల రచయిత్రు లెందరు? అలాగే 'అగ్నిపుష్పం, పున్నమి మసకలు, చిఱుచెమటలు-చందనం, సాయంకాలే వనాంతే...'లాటి కథలు మనో నేత్రానికి మరోలోకాన్ని చూపిస్తాయి.

'ఉషశ్రీ' అసలుపేరు పురాణపండ సూర్యప్రకాశ దీక్షితులు 'మల్లెపందిరి. అభిధ, కులపాలిక, జ్వలితజ్వాల, అంతర్వత్ని లాంటి ఆహ్లాదకరమైన కథలు ఈయన వ్రాసినవి. మధ్యతరగతి తెలుగు కుటుంబాల్లోని ముద్దుముచ్చట్లు ఈయన ఎంత అందంగా చెప్తాడు! శ్రీపాద వారిలోని సమగ్రదృష్టి, మల్లాది వారిలో కళాసృష్టి ఈయనలో అందంగా మేళవించాయి.

'సమత, మట్టిమనిషి'వంటి నవలల ద్వారా ఉత్తమ రచయిత్రిగా సుప్రతిష్ఠితురాలైన వాసిరెడ్డి సీతాదేవిగారు మొదట్లో చాలా కథలు రాసి రెండు దశాబ్దాలకు పూర్వమే గుర్తింపుపొందినవారు. సమాజంలో వివిధ స్థాయిల్ని సునిశితంగా పరిశీలించి వివిధ కోణాలనుంచి వాటిమీదికి వెలుగు ప్రసరింపజేయడంలో ఈమెకు మంచి నైపుణ్యముంది. మిసెస్ కైలాసంవంటి పాత్రలు ఈమె చేతుల్లో ప్రాణం పోసుకుని జీవించడంలో ఆశ్చర్యమేముంది? 'పెంకుటిల్లు, గోంగూరాకు'వంటివి మొదలు ఇటీవలి, 'ఈ దేశంలో ఒక భాగమిది' అనే నవలవరకు రాసిన కొమ్మూరి వేణుగోపాలరావుగారు కొన్ని మంచి కథలు కూడా రాశారు. అనేక రచనలు హిందీలోంచి తెలుగులోకి, తెలుగులోంచి హిందీలోకీ పరివర్తితం చేసిన ప్రసిద్ధ అనువాదకులు దండమూడి మహీధర్‌గారు తెలుగులో మౌలికంగా రాసిన కథలు కొన్ని రెండు మూడు సంపుటాలుగా వచ్చాయి.

'అపస్వరాలు'వంటి నవలలతో అల్పకాలంలోనే ఆంధ్రపాఠకుల అభిమా నాన్ని అందుకున్న తమిళుడు, 'శారద' (నటరాజన్) అప్పుడే కనుమరుగై పోవడం ఎందరికో బాధ కలిగించింది. ఆయన కొన్ని కథలు కూడా రచించాడు.

'కన్నసామి', 'నవీన్', డి కామేశ్వరిగార్లు కొన్ని చక్కటి కథలు ప్రచురించారు, చిత్తూరు ప్రాంతంనుంచి ముంగర శంకరరాజుగారు చైతన్య స్రవంతి (stram of consciousness) పద్ధతిలో ఆకర్షకమైన కథలు రాశారు. ముద్దంశెట్టి హనుమంతరావు, శ్రీవిరించి, ఓగేటి శివరామకృష్ణ, ఆర్. ఎం. చిదంబర, వీరుభొట్ల సత్యనారాయణమూర్తి రెండు దశాబ్దాల క్రితం విరివిగా రాసిన కథకులు. 'రంగులవల' నవలకు ప్రథవారపత్రిక బహుమాన మందుకున్న ఎం. పార్థసారథి (పినాకి) 'ఎర్రదీపం'వంటి శక్తిమంతమైన కథలు కూడా రాశాడు.

యఱ్ఱంశెట్టి శాయి, 'చంద్ర' (ప్రఖ్యాత చిత్రకారుడు), కథానికా రచనలో చక్కటి నైపుణ్యం చూపినవారు.

సున్నితమైన మనోవృత్తుల్ని తీసుకుని సుందరంగా మలిచిన కథకుడు మంజుశ్రీ (అక్కిరాజు రమాపతిరావు). 'అవతలివైపు' ఆ ఉత్తరం, అగ్నిపుష్పం, వానలో తడుస్తున్న మనిషి, మైథిలి,రైలుపడిపోయింది, అరుణ, మంచుకురిసినరాత్రి మొదలైన కథలు రెండు వందలదాకా రాశారు. మనస్సును ఉగ్ర్యాతలూపే కథలూ, కన్నులు చెమ్మగిలజేసే కథలూ ఒక్కచేతిమీదుగా నడిపిన కథాశిల్పి.

నాయని కృష్ణకుమారిగారు 'ఆయా థా. కవిగారి భార్య, గుడ్డితనం'లాటి చక్కటి కథలు రాశారు. 'చిలుకతల్లి పుట్టింది' అన్నది గొప్పగా ఉంటుంది. నాటికలు, నవలలు, అనువాదాలు, అనుసరణలు విశేషంగా చేసిన కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు 'జైలు' కళ్యాణి-కామితార్థప్రదాయినీ :, చీమ-గొల్లభామ, పాములాంటి బ్రతుకు' లాంటి అందమైన కథలు కూడా రాశారు, ఇసుకపల్లి దక్షిణా మూర్తిగారు 'చెరగని అక్షరాలు' మాదిరిగా నిలిచిన కథకుడు. 'టపాకాయలు, పూవులు-కాయలు. చెరగని అక్షరాలు, జన్మహక్కు'లాంటి ఇంపైన కథలు రాశారు. ఆయన అన్నగారు, అనేక నవలలు రాసిన లక్ష్మీనరసింహశాస్త్రిగారు 'కచటతపలు'వంటి మంచి కథలు కూడా రచించారు.

'మంచుపల్లకి-మరితొమ్మిది' శ్రీమతి పి. వి. చలపతిరావు గారి కథల సంపుటి. ఇందులో 'రోజూ సూర్యుడు ఉదయిస్తాడు (ఉరవ్ ఉదయం), చేతుల

కుర్చీ, కాచేసినసిరి'వంటి గొప్ప కథలు రాశాడు. చిన్నచిన్న వాక్యాల్లో తీవ్రమైన శక్తిని నిక్షిప్తంచేయగల కళాశీలి ఈయన. 'గాజు కిటికీ' తాడిగిరిపోతరాజుగారి కథల సంపుటి. ఇందులో ఆ పేరుగల కథతోబాటు 'జిర్రేళ్లు. లోయలు, ముష్టివాళ్ళు, పావులు' మొదలైన చక్కటి కథ లున్నాయి చలసాని ప్రసాదరావుగారు మంచి సెబ్బరలు వివేచించగల కళాకారుడేకాదు; చక్కని కథకుడుకూడా. 'కథలూ కాకరకాయలూ' అన్న పేరుతో ఈయన ఒక కథల సంపుటి వెలువరించారు. దాశరధి రంగాచార్యగారు 'చిల్లరదేవుళ్ళు, మాయజలతారు, జనపదం, మోదుగపూలు'వంటి రచనలద్వారా నవలాకారుడుగా ప్రఖ్యాతుడైనా సమకాలిక జీవనసరళి ప్రతిబించే కథలు కూడా రాశారు.

సి. యస్ రావు 'ఊరుమ్మడి బతుకులు' గొప్పగా తీర్చిదిద్ది ప్రఖ్యాతుడైన కథకుడు సమాజంలో అన్యాయానికి గురి అవుతున్న వాళ్లను గురించి ఇంత కళాత్మకంగా చిత్రించిన వాళ్ళు అరుదు. 'కొరడా' లో సింగి ఎంతముచ్చటయిన పాత్ర! 'పావులు పాములుగా మారినవేళ, బంగారమ్మకమతం, ఊరుమ్మడి బతుకులు, గుమ్మిడిగింజలు, పేవ్‌మెంటు, ఇప్పుడు వీస్తున్నగాలి' మొదలైన వాటిలో ప్రతి ఒక్కటీ సమకాలిక సమాజానికి అద్దంపట్టే కథ.

'పెళ్ళి ప్రయాణం' అనగానే యద్ధనపూడి సులోచనారాణి గుర్తుకువస్తారు. ఎంత ముచ్చటగా సాగింది కథ! అప్పట్లో రాసిన కథలు 'తొలిమజిలీ, అదృష్ట దురదృష్టాలు' మొదలైనవి ఆమెకు మంచి పేరుతెచ్చాయి. 'లత' (తెన్నేటి హేమలత) రాసిన 'మదరిండియా' లాటి కథలు ఆమే రాయగలరుతప్ప మరొకళ్లకి సాధ్యంకాదు. పరిమళాసోమేశ్వర్ 'గాజుపెంకులు, క్రోటన్ మొక్కలు' లాటి చక్కటి కథలు రచించారు

శీలా వీర్రాజుగారు చిత్రకారుడు, కవి, నవలారచయిత, కథకుడు– ఇవన్నీ చక్కగా సమ్మిశ్రపణం పొందిన భావుకుడు, 'పగా మైనస్ ద్వేషం, రెండు కన్నీటి చుక్కలూ– ఒక ప్రశ్న, అతుకుపడ్డ సౌందర్యం, పొడిమేఘం, పెనుగాలి, కథ నాదీ ముగింపు ఆమెదీ' మొదలైన గొప్పకథలు రాశారు. 'నగ్నముని' కవిగా సుప్రసిద్ధుడు. 'దీపం, శవం, బొద్దింక, తిమింగలం' లాటి చౌరవైన కథలు ఆయన ముద్రను ప్రస్ఫుటంగా చూపే రచనలు, అలాగే చెరబండరాజు 'చిరంజీవి', నిఖిలేశ్వర్ 'సూర్యుడు', మరువాడ రాజేశ్వరరావు 'కుక్కతోక', ఎన్. ఎస్. ప్రకాశరావు 'పేపర్ టైగర్' మొదలైన కథలు రాశారు.

పోతుకూచి సాంబశివరావు ఏనాడో రాసిన కథ 'బతుకుల పతనం'. అలాగే 'కుక్కపిల్లా-అగ్గిపుల్లా-సబ్బుబిళ్లా' మొదలైన కథలు ఎప్పుడూ గుర్తొస్తూ ఉంటాయి. 'అమ్మ, తోలుబొమ్మలు, అచ్యుతరావు వార్ధక్యం' వంటి కథలు కాళూరి హనుమంతరావుగారు రచించిన చక్కటి కథలు, 'మనోవిహంగం' అన్న సంపుటిలోవి.

భమిడిపాటి రామ గోపాలంగారు బహు గడసరి. 'వంటొచ్చిన మొగాడు, అనుభవానికి హద్దులు, నళినీదళ సంస్థితం, కాలుజారిన కమల, త్రివర్ణం, బ్రేక్ డౌన్' వంటి ముచ్చటయిన కథలు తన పేరుతోనో, 'సత్యభామ' పేరుతోనో ప్రకటిస్తూ ఉంటారు. కథను తీర్చి దిద్దడంలో ఈయన ఎంత నేర్పు చూపిస్తాడో దానికి శీర్షిక పెట్టడంలో కూడా అంత చమత్కారం కనబరుస్తాడు. 'మూడు గదులు' అన్న కథలో, గదులూ లేవు పదులూ లేవు: ఒక 'కాల్ గర్ల్' కున్న మూడేమూడు కోరికలు! బహుసున్నితమైన హాస్యం అందించడంలో ఈయన బహునేర్పరి.

'గంగరేగిచెట్టు', పేరు వినగానే యశోదారెడ్డిగారి పేరు గుర్తువస్తుంది. ఆ పేరుతో చక్కటి తెలంగాణా నుడికారంలో ఆమె చెప్పేకథలు సరికొత్తగా ఉంటాయి. 'మా వూరి ముచ్చట్లు' అన్న పేరుతో ఇటీవల వచ్చిన కథల సంపుటమే అందుకు సాక్ష్యం. అందులో 'గంగరేగిచెట్టు, నాగి, మ్యానరికం, పీర్లపండుగ, మొమ్మెకథ, ఎంకన్న' మొదలైనవి ఎంతో ముచ్చట గొలిపేకథలు, మాండలిక భాషలో రచన చేసినప్పుడు కనిపించే అందచందాలకు అద్దంపట్టే రచనలివి. ఇంతకుపూర్వం ఇరవై ఏళ్ళక్రితం తెలంగాణా జానపదమాండలికంలో కథలు రాసిన ప్రముఖులు ఇద్దరున్నారు-సురమౌళి 'అంగుడు పొద్దు', ఇరివెంటి కృష్ణ మూర్తిగారి 'రంగులంగయ్య' ఎవరు మరిచిపోగలరు?

'మురయా' అంటే తప్ప, మునిమాణిక్య రమాయాజ్ఞవల్క్య అంటే చాలా మందికి తెలియదు. ఆయన 'నిత్యమల్లి, జీవితంలో మలుపు, ప్రతిఫలం' మొదలైన చక్కటి కథలు రాశారు, 'పగయడగించుటది శుభంబు' అన్నది, బడిపంతుళ్ళు ఉన్నంతకాలం నిలిచేకథ. గోవిందరాజు శ్రీనివాసమూర్తిగారు 'పక్కింటిగౌరి, ఇద్దరు మిత్రులు, రాధేగోపాలం, రౌండ్ రానా, ఎదురిల్లు' మొదలైన కథలు రాశారు.

శంకరమంచిసత్యం-కాదుకాదు, సత్యం శంకరమంచి- 'కార్తీక దీపాలు' వంటి కథలు రాసిన గొప్ప కథయిత. 'పరదా' తమాషాగా ఉండే కథ, అందులో

ఆయన ఊహ ఎంత దూరమైనా పోతుంది. అందులో చిత్రించిన చంద్రుడు, వెలుగుతో దోబూచులాడుతున్న నల్లటి కమ్మీల నీడలు వేటికో సంకేతాలు, ఇలా రకరకాల ప్రయోగాలు చేస్తుండే ఈ 'నిచ్చకొత్త' ల కథయిత, ఇటీవల 'అమరావతి కథలు' అన్న పేరుతో 'ఆంధ్రజ్యోతి' లో వారంవారం రాస్తున్నారు.

అత్తగారికి పేరుతెచ్చిన 'ఉత్తమాకోడలు' భానుమతీరామకృష్ణగారు. ఆవిడ చెప్పేవి కథలే నంటే ఎవరం నమ్మలేం-రోజూ ఇంట్లో జరిగేవన్నీ రాసేస్తున్నారా అన్నంత సహజంగా, సాఫీగా సాగిపోతుంటాయి. ఎవరు ఎలా అనుకున్నా, పదిమందిని ఆకర్షించగల కథలు చెప్పే నేర్పుగలవారు భానుమతిగారు. 'భానుమతి కథానికలు' ఒక సంపుటంగాను, 'అత్తగారికథలు' రెండు సంపుటాలుగానూ వచ్చాయి, 'జీవితంలోని అగాధాలు, ఎందుకులెండి, కోరికలూ కొరతలూ, అత్తగారూ ఆవకాయపొడీ, అత్తా తోడికోడలీయం, అత్తగారూ జపానుయాత్రా' మొదలైనవి ఇంటిల్లిపాదీ కూర్చుని చదువుకుంటూ ఆనందించగల ముచ్చటయిన కథలు.

రంగనాయకమ్మగారు గుండెనూ మనస్సునూ ఆక్రమించే కథలు రాసిన రచయిత్రి. ఎప్పుడో చిన్నప్పుడు రాసిన 'పల్లెటూరు' అన్న పెద్దకథ ఇప్పటికీ గుర్తుకువస్తూ ఉంటుందికదా! 'శోభనంనాటి రాత్రి' అన్న సంపుటంలో ఆమె ఆలోచనసరళికి అద్దంపట్టే 'ఆర్తనాదం, మనమిద్దరమే వుందాం, విజయ' వంటి చక్కటి కథలున్నాయి.

ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారి 'సుజాత' మునిమాణిక్యం వారి 'కాంతం' లాటి దొడ్డఇల్లాలు కాదు. అంతకంటె నాలుగాకులు ఎక్కువ చదివిన ఆధునిక నవలామణి. శ్రీవారి మనస్సును ఎప్పటికప్పుడు ఎక్స్‌రే తియ్యగల నేర్పరురాలు, వాళ్లమధ్య వచ్చే ప్రణయకలహాలూ హైక్లాస్‌వే. అలిగి అమ్మగారింటికి వెళ్ళి పోయినా ఆయనగారిమీదే ఆమె చూపు ఎప్పుడూ ఇలాటి 'సుజాత'ను తీర్చిదిద్ద గల నేర్పు ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారికే ఉంటుంది. 'ఎదురద్దాలు' సంపుటం అందుకు నిదర్శనం. అలాగే 'చేదుకూడా ఒక రుచే' అన్న సంపుటంలో కథలు ఆయన కథన నైపుణ్యానికి తీపిగుర్తులు.

'బ్రతుక నేర్చిన మృత్యువు' ఉమాపతి పద్మనాభశర్మగారికి పేరుతెచ్చిన కథ. కాలం తెచ్చిన మార్పు, మొగలిపువ్వు, ఆత్మజ్ఞానం, అమృతుడు, పంకజం, ఎరుపు మొదలైన కథలు ఆర్. ఎస్. సుదర్శనంగారి రచనా నైపుణ్యానికి ప్రతి

బింబాలు. నవలా రచయితగా, సాహిత్య వివేచకుడిగా సుప్రతిష్ఠితులైన సుదర్శనం గారు చక్కటి కథకులుగా కూడా పేరుపొందడం విశేషం. ఆయన చూపు లోతైనది; రచన గాఢమైనది

'తొలిమలుపు' పీరాజీ (పిళ్లాకృష్ణమూర్తి.) 'లక్ష, పాతకథ' వగైరా రచనల ద్వారా కథకుడుగా రాణించాడు. కొమ్మూరి వేణుగోపాలరావుగారు 'మరమనిషి' మొదలైన కథలు రాశారు అబ్బూరి ఛాయాదేవిగారి 'సుఖాంతం', ఇస్మాయిల్‌గారి 'వల' బాగుంటాయి. ఆచంట శారదాదేవిగారు 'మరీచిక, ఆనాటి అతిథి' మొదలైన కథలు రచించారు నార్ల చిరంజీవిగారి 'మ్రరీనీడా మల్లెతీగా' వాస్తవాన్ని ప్రతిబింబించే కథ.

గొల్లపూడి మారుతీరావుగారు 'రోమన్ హాలిడే, అందమైన జీవితం, పరకీయ, కంచికి వెళ్ళనికథ' వంటివి రాశారు. అమరేంద్ర (చతుర్వేదుల సరసింహశాస్త్రి)' గారు కూలిన శిఖరాలు, సంధ్యారాగం, నిష్క్రమణ, దేహం-గేహం, రాగమాలిక, మొదలైన కథలు రచించారు. ఈయన కథల్లో ఎత్తుగడ బాగా ఆకర్షిస్తుంది. బి. వి. రమణారావుగారు 'ప్రేమబోధిని, మునిమాపు వయసులో, చెట్టు క్షమించవు, సంధ్యావందన మహత్యం'లాటి కథలు సున్నితమైన హాస్యం జోడించి అందించారు.

తక్కువ కాలంలో మంచి కథలు చాలా అందించిన వాళ్ళలో ఆదివిష్ణు (విఘ్నేశ్వరరావు) గారొకరు. 'ఉద్యోగం'వంటి కథలు అందుకు ఉదాహరణ. ఆయనా 'హవిస్' కలిసి రాసినవి కూడా కొన్ని ఉన్నాయి. మాలతీచందూర్‌గారు 'డాబాయిల్లు' మొదలైన కథలు రాశారు. 'సమర్పణ, మనం మిగిలేం' రాసిన కందుకూరి లింగరాజుగారు 'తెరవెనుక'లాటి కథలు కూడా రాశారు. టి. వి. రత్నావళిగారు 'కట్నంకోసం......' మొదలైన కథలు రాశారు.

ఎప్పుడో పదిపదిహేనేళ్ళ క్రితం ఆంధ్రపత్రికలో 'రాజధానికబుర్లూ' తరవాత హాస్యస్ఫోరకమైన చక్కటి వ్యాసాలూ రచించిన కీర్తిశేషుడు తురగా కృష్ణమోహనరావుగారు ముచ్చట గొలిపే కథను కూడా రాశారు (చూ. 'పార్కులో పచ్చపుటం అన్న సంపుటంలో శీర్షికలేని కథ). వారి శ్రీమతి జానకీరాణిగారు 'మనసులోని బొమ్మ, క్షణంలో పెరిగిన గోపాలం' మొదలైన కథలు చాలా కాలంగా, చాలా మంచివి రాశారు. సిద్ధాంతా అర్భాటాలూ, శిల్పాల గజిబిజులూ చొప్పించకుండా హాయిగా చదివించే కథలు ఈమెవి. పవని నిర్మల ప్రభావతిగారు 'అనాథ' మొదలైన కథలు చాలా రాశారు.

కేతు విశ్వనాథరెడ్డిగారు 'పులిగీతం'వంటి కథలు రచించారు. 'అరచేతిలో గీత'వంటి చక్కటి రచనలు చేసినవారు పులికంటి కృష్ణారెడ్డిగారు. అలాగే నూతలపాటి గంగాధరంగారి 'తివాచీ', ఆర్. వసుంధరగారి 'వేషం, న్యాయం', వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారి 'గాయపడిన దేవత', ఆదిష్టి నరసింహులుగారి 'పునాదిరాయి', లంకిపల్లి కన్నయ్య నాయుడుగారి 'సుడిగాలి' 'ఈరేడులోకా'లన్న సంపుటికి నిండుతనం చేకూర్చిన చక్కటి కథలు.

పూసపాటి కృష్ణంరాజుగారి 'దివాణం సేరీవేట'వంటివి ఎలా మరిచిపోతాం. అలాగే సి. రామచంద్రరావుగారి 'వేలుపిళ్లై, ఏనుగులరాయి నల్లతోలు'వంటివి బాగా ప్రసిద్ధమైన కథలు. ఆరోజుల్లో విశాఖ రాసిన 'చిరస్మృతి' అన్న కథ ఆంధ్రపత్రికలో వచ్చిన ఒక మంచి కథ. ఈరంకి వెంకటరావుగారు 'నమ్మలేని నిజం'వంటివి రాశారు.

ఎంతరాసినా తరగని గని బలివాడ కాంతారావుగారి కథా సంపత్తి. 'సభ్యత' లాటి గొప్ప కథలు రాసిన కాంతారావుగారిని తెలుగు దేశం ఎలామరచిపోతుంది? బుచ్చిబాబుగారి శ్రీమతి, శివరాజు సుబ్బలక్ష్మిగారు 'తెల్లవారింది, కావ్యసుందరి కథ'వంటి హుందాతనమున్న కథలు చాలా రాశారు. వాటిలో కొన్ని మూడు సంపుటాల్లో వచ్చాయి. అనేక నవలలురాసి ప్రజారంజకమైన రచయిత్రిగా పేరుపొందిన ద్వివేదుల విశాలాక్షిగారు 'ఎవరికోసం'వంటి కథలుచాలా రచించారు. 'రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది' అన్న సంపుటంతో వెలుగులోకి వచ్చిన రచయిత్రి బీనాదేవిగారు. 'ఏ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్, తాన్క్స్ ఫర్ ది పీయమ్'. లాటి అద్భుతమైన కథలు రాశారు.

'కౌసల్య, నవోదయం, దీపశిఖ, సంఘం చేసిన మనిషి'వంటి నవలలు రచించిన పోలాప్రగడ సత్యనారాయణ మూర్తిగారు స్వతహాగా చక్కటి కథకుడు. ఎప్పుడో కాని కథలు రాయని బి. రాఘవేంద్రరావుగారు 'మధుర మీనాక్షి' అన్న సంపుటంలో మంచి కథలు ప్రచురించాడు. సి. ఆనందారామంగారు 'సృష్టిరహస్యం' వంటి కథలు రాసినవారు. శాంతి కృష్ణమూర్తిగారు 'కృష్ణాంజలి' అన్న కథల సంపుటం ప్రచురించడమేకాక 'కథలు రాయడమెలా? అనే వివరణ గ్రంథం కూడా రచించారు. పోలాప్రగడ రాజ్యలక్ష్మిగారు 'రాజ్యలక్ష్మి కథలు' అన్న సంపుటం వెలువరించారు. వేదుల శకుంతల 'అసమర్థుడు, వరలక్ష్మి'వంటి కథలు రాశారు.

డివి వెంకట్రామయ్యగారు రాసిన 'ఒక చావు, ఒక మృత్యువు' చాలా మంచి కథ. ఇలాటివే కొన్ని కథలు కలిపి ఇటీవల ఒక సంపుటం ప్రకటించారు. వి. రాజారామమోహనరావు, పి యస్. నారాయణ శ్రీసుభా, హవిస్, ముదిగొండ శివప్రసాద్, చందు సోంబాబు మంచి కథలు కొన్ని ప్రచురించారు. 'త్రిపుర', చీకటి గదులు), 'అరవింద' అన్న కలం పేరుగల రచయిత(త్రు)లు ప్రముఖ పత్రికల్లో అద్భుతమైన కథలు రాశారు. కొలకలూరి ఇనాక్ రాసిన 'ఆ వెండిసైటిస్'లో ఎంత వ్యంగ్యముంది !

'ఇప్పుడు వీస్తున్నగాలి, హోరు, జనం' వంటి కథాసంపుటాలు విప్లవ రచయితల దృక్పథాన్ని సుస్పష్టంగా ప్రతిబింబిస్తాయి. శ్రీశ్రీ, రాచకొండ, సి. యస్. రావు, చెరబండరాజు, నిఖిలేశ్వర్, కాశీపట్నం, అరుణకుమార్, తేజోనిధి, మరువాడ, రామానుజం, ప్రకాశరావువంటి వాళ్ళ రచనలు ఈనాడు సమాజంలో ఎదురయే పరిస్థితుల్ని శక్తిమంతంగా ప్రదర్శించాయి. వివిధ సమస్యల పరిష్కారానికి వారు సూచించే మార్గానికి హర్షించనివాళ్ళుకూడా వాస్తవాన్ని అంగీకరించకపోరు. అలాగే కరీంనగర్, ఉద్యమ సాహితివారు 'బద్‌లా' అన్న కథల సంపుటి ప్రచురించారు ఇందులో తాడిగిరి పోతరాజుగారి 'బ్లాక్ అండ్ వైట్', వినోద్‌గారి 'పునాది', తిరుపతిగారి 'పిడికిళ్ళు బిగుసుకున్నరాత్రి', యం. వి. తిరుపతయ్యగారి 'న్యాయం', శరత్‌కుమార్‌గారి 'రేపటి ఉదయం', వెంకటరెడ్డిగారి 'పోచమ్మ కథలు ఉన్నాయి. వీటిలో కొన్ని తెలంగాణా జానపదుల మాండలికంలో చాలా సహజంగా సాగినవి.

సాహిత్య వ్యాపనాన్ని ఒక మహోద్యమంగా సాగిస్తున్న 'యువ భారతి' వారు 'కథాలహరి' అన్న పేరుతో రెండు సంపుటాలు వెలువరించారు. అంతకు ముందు 'పంచవటి' అన్న పేరుతో ప్రఖ్యాతరచయితలూ, రచయిత్రులూ అయిన ఆవసరాల రామకృష్ణారావు, మంజుశ్రీ, శీలావీర్రాజు, లత, సి. ఆనందారామం రాసిన కథల సంపుటి ఒకటి ప్రచురించారు చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘంవారు 'ఈరేడులోకాలు' అన్నచక్కటి సంపుటం ఒకటి రూపొందించారు. అలాగే విశాఖసాహితివారు ఇటీవల 'ప్రతిబింబాలు' అన్న సంపుటం వేశారు. ఇందులో ద్విభాష్యం రాజేశ్వరరావు, ఎస్. కాశీవిశ్వనాథం, అంగర వెంకట శివప్రసాదరావు, మండలీక వెంకటేశ్వర్లు, మంగు రాజగోపాలరావు, డి. రంగనాయకమ్మ, ఘండికోట బ్రహ్మాజీరావు, ముద్రగడ సూర్యప్రకాశరావు,

ని వెంకటనరసింహారావు, విజయారఘురామ్, అంగరవెంకట కృష్ణారావు, ు, మల్లాప్రగడరామారావుగార్ల కథలున్నాయి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకా వారు వెనక, 'మందారాలు' అన్న కథల సంపుటం ఒకటి ప్రచురించారు.

యం. శేషాచలం అండ్ కంపెనీవారు 'విద్యార్థిసాహితి' అన్న శీర్షిక కింద ంజలి'గా ప్రచురించిన మూడు సంపుటలూ యువతరం రచయితల కృషిని పస్థంచేశాయి. పాలకోడేటి సత్యనారాయణరావు, బండారు ఉమామహేశ్వర , స్వాతి, అడపా రామారావు, అమృతలత, అంగర వెంకట శివప్రసాదరావు, ప్రసాదు, కమలకుమారి, నాగేశ్వరరావు, వెంకటరమణ మొదలైన వాళ్ళ ంలు వారి ఉపజ్ఞకు చక్కటి ప్రతిబింబాలు.

ఈ విధంగా వివిధ సాహితీ సంస్థలూ ప్రచురణకర్తలూ సొంతంగా అచ్చు కోగల స్తోమతగల రచయితలూ కథాసంపుటాలు ప్రచురించి మరుగునపడి మే ప్రమాదంలేకుండా కొన్నిటిని రక్షిస్తున్నారు. అయితే దేశంలో ఈనాడు ధ పత్రికల్లో వస్తున్న కధాసాహిత్యం పరిమాణం ముందు ఈనాడు గ్రంథస్థ ృతున్నది చాలా అల్పమని చెప్పాలి.

కథానికా ప్రాచుర్యానికి తోడ్పడ్డ సాధనాల్లో రేడియో ఒకటి. అందులో ప్పుడప్పుడు కొన్ని చక్కటి కథలు వినవస్తూ ఉంటాయి. 1962 ప్రాంతంలో సారి రేడియో హైదరాబాదు కేంద్రంవారు శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పూని ాశ 'ఏకాదశి' అన్న పేరుతో కథక సమ్మేళనం ఒకటి ఏర్పాటుచేశారు. చాలా క్కగా నడిచిన కార్యక్రమమది. అందులో ఆనాడు పాల్గొన్నవాళ్లలో-వాకాటి ండు రంగరావు, మంజుశ్రీ, వాసిరెడ్డి సీతాదేవి, పోరంకి దక్షిణామూర్తి, యద్దన డి సులోచనారాణి, ఇసుకపల్లి దక్షిణామూర్తి, నాయని కృష్ణకుమారి మొదలైన ళ్ళు ఉన్నారు. అంతకుముందు, 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సంద ంగా ఒక చక్కటి కథకసమ్మేళనం జరిగింది. తరవాత ఇటువంటి కార్యక్రమాలు రిగినట్టు అంతగా వినబడవు. శ్రోతల సమక్షంలో జరిగే ఇటువంటి కార్యక్రమాల యినా, రేడియోలో ప్రసారానికయినా రాసేకథలు-ప్రత్యేకంగా శ్రోతల్ని దృష్టిలో ట్టుకుని రాసినవి అయి వుండాలి. సరళంగా, సహజంగా, చెవిని ఆకట్టుకునేటట్టు ండాలి కాని పదాడంబరంతోను, సంశిష్టవాక్యాలతోనూ ఉండగూడదు. మద్రాసు, జయవాడ, హైదరాబాదు రేడియో కేంద్రాలు కవిత్వంతోబాటు కథలకుకూడా ానమిస్తున్నాయి.

ఆరుదశాబ్దాలుపైబడి ఈ విధంగా సాగుతూవస్తున్న కథానికారచన రచయితల్నీ రచయిత్రుల్నీ ప్రభావితంచేసింది, అనేక వేల కథల్ని తెలుగ జిలో పండించింది. ఇది ఆహ్లాదకరమైన విషయం. ఇందుకు తోడ్పడ్డ లందరూ అభినందనీయులు. వాటిని వెలుగులోకి తెచ్చిన వివిధ పత్రికా కులూ ప్రచురణకర్తలూ మెచ్చుకోదగ్గవాళ్లు.

ఈ ఆరు దశాబ్దాల పైచిలుకు కాలంలో కథానికా ప్రకియ వివిధ పరిణా లోనయింది. ఆదిలో కేవలం ఉద్దిష్ట విషయానికున్న ప్రాధాన్యం శిల్పాని వ్యక్తిగత సమస్యలూ కుటుంబంలోని వివిధ వ్యక్తులమధ్య సంబంధాలూ విషయానికి ఆలంబన. అప్పటికీ వీరేశలింగంపంతులుగారి సంస్కరణో దేశంలో నలుమూలలా వ్యాపించింది. అనూచానంగావస్తున్న జీవన విధ ఆలోచన పద్ధతుల్నీ, నమ్మకాల్ని పునఃపరిశీలనలోకి తెచ్చింది. పాత విల పూర్తిగా తిరస్కరించకపోయినా, కొత్తవిలువల్ని ధైర్యంగా స్వీకరించకపో సమకాలిక జనజీవనంలో మార్పులు రావలసిన అవసరాల్ని ఆనాటి విద్యా లందరూ అంగీకరించారు. అయితే వాటి సమన్వయ సాధనలో కొందరు ము సాగారు, కొందరు వెనకబడిపోయారు బాల్యవివాహాలు, వితంతువుల కడగ మూఢవిశ్వాసాలు, అధికారుల దుండగాలు, అవినీతి, మతవిద్వేషాలు, కుల మానాలువంటి సమస్యలు ఆనాటి రచనల్లో ప్రాముఖ్యం వహించాయి. తర చలంగారి రాకతో స్త్రీ సమస్యలవైపు దృష్టిమళ్ళింది. వ్యక్తిగత సుఖసంతో సాధనకూ వ్యక్తిత్వ వికాసానికీ అవరోధాలుగా కనిపించే వాటి నన్నిటినీ ని లించాలన్న పట్టుతో ఆయనరాసిన కథలు పాఠకుల్లో ఆసక్తిని పెంపొందించ స్త్రీ పురుష సంబంధాల్లో ఆయన ప్రతిపాదించిన స్వేచ్ఛ అందరికీ ఆ యోగ్యం కాకపోయినప్పటికీ వాళ్ల అవగాహనను గాఢంచేసింది. కేవలం కా వ్యాపారంగా ఈసడింపుకు గురిఅయ్యే సమస్యల్నికూడా మరింత సానుభూ చూడాలన్న ఔదార్యం ఏర్పడింది. చలంగారి వాదంలోని నేర్పు, శైలిలో సొగసు పాఠకులకు అభిమానపాత్రం కావడమేకాక ఆయన చిత్తశుద్ధి అ మన్ననలనూ అందుకుంది. ఒక పక్క చలంగారి ప్రభావం ఒక ఉప్పె వ్యాపిస్తూ ఉండగా మరో పక్క మునిమాణిక్యం వారి రచనలు పాఠకుల దృ ఆకట్టుకున్నాయి. ఉన్న పరిధిలోనే దాంపత్యజీవితాన్ని ఆహ్లాదకరం, ఆన మయం చేసుకోవచ్చునన్నసత్యాన్ని చాటి చెప్పినాయి.

అచ్చమైన తెలుగు జీవితంలోని తీరు తెన్నుల్నీ తెలుగు పలుకుబడిలోని తీయందనాల్నీ అందించడానికి నడుముకట్టారు శ్రీపాద, మల్లాదివారు. మధ్య తరగతి మానిసికి ముప్పొద్దులా ఎదురయ్యే ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యల్ని కథావస్తువులుగా స్వీకరించి వేలాదిగా కథలు పండించినవారు కొడవంటివారూ గోపీచంద్‌గారూ. వాటిలో వైవిధ్యం, సమకాలికత, తార్కికదృష్టి పెంచిన ప్రముఖులు ఈ ఇద్దరూ. సూక్ష్మాతి సూక్ష్మమయిన మనఃప్రవృత్తుల్ని కళ్లకు కట్టించిన కథాశిల్పులు బుచ్చిబాబు, పద్మరాజుగార్లు. కిందిస్థాయిలో రకరకాల శక్తులతో ఘర్షణపడుతూ, లేస్తూ బతికేవాళ్ళ కధల్ని అందించినవాళ్ళు రాచకొండ, కాళీపట్నం వారు.

రెండోసారే కాదు, మరోసారీ మరోసారీకూడా ప్రపంచకథానికల పోటీకి నిలబడే సత్తాగల పురాణం, ''మానవుల మనస్తత్వాలను నగ్నంగా యక్స్‌రే''లా చూపగల హితశ్రీ, అతిసున్నితమైన భావవృత్తిని అత్యంత సుందరంగా తీర్చిదిద్దగల కాంతారావు, రాజారాం, భరద్వాజ, పన్యాల, ముళ్ళపూడి, అవసరాల, వాకాటి ఇలా ఎందరెందరో కథయితలూ కథయిత్రులూ తెలుగు కథల పంటను సుసంపన్నంచేశారు. వస్తువులో, శైలిలో, కథన చాతుర్యంలో ఎన్నెన్నో పోకడలు చూపారు, అందాలు సంతరించారు! వీరందరి సమష్టికృషి ఫలితమే ఈనాటి మన కధానికా వాఙ్మయసంపత్తి. కొత్తగా కలంపట్టి ఉత్సాహబలంతో ఉరవడిచూపే నవ కధారచయిత మొదలు పాండిత్యంతోను, అనుభవంతోను పండిన పెద్దలవరకూ ఈ కీర్తిలో భాగస్వాములే.

ఈనాడు మన కథకుల్లో, సమాజం అట్టడుగు కోణాల్లోకి సూటిగా దృష్టి ప్రసరిస్తున్నవాళ్ళు ఇప్పుడు దండిగా ఉన్నారు. రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల్లో ఎన్నిరకాల అన్యాయాలకూ అక్రమాలకూ గురి అవుతున్నామో కళ్ళకు కట్టినట్టు చిత్రించే రచనలు వస్తున్నాయి. కొన్నిటికి కొన్ని కొన్ని రాజకీయ దృక్పథాలు ఆలంబన అయితే మరికొన్నిటికి వాస్తవపరిస్థితులే ఆలంబన అవుతున్నాయి. భాష వెనకటికంటె మరింత సరళమవుతోంది. వాక్యాలు సరళమవుతున్నాయి. క్రియారహిత వాక్యాల్లో అఖండ స్ఫూర్తి కలిగించే శైలి శ్రీపతి లాంటి వారి రచనల్లో స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. వెనక, అక్కడక్కడ కొన్ని మాండలిక ప్రయోగాలు తొంగి చూసేవి. ఇప్పుడు పూర్తిగా ప్రాంతీయ, సామాజిక, వర్గ మాండలికాల్లో రాసిన రచనలు కూడా వస్తున్నాయి.

కథానికాశిల్పంపట్ల ఇప్పుడంతగా పట్టింపులు లేవనిపిస్తోంది. కొసమెరుపు మీద ఇప్పటి వాళ్ళకి మోజులేదు. ఏదో ఒక సంఘటన, ఒకటి రెండు పాత్రలు ఉంటేచాలు- కథరాయడమేముంది, ఆఫ్టరాల్ ! అనుకునేవాళ్ళుకూడా ఉన్నారు. ఇది ఆత్మవిశ్వాసంమీద ఆధారపడ్డదయితే ఫరవాలేదు కాని, అతివిశ్వాసంమీద ఆధారపడితే మోసంవస్తుంది. 1950 ప్రాంతంలో ఒక పదేళ్ళపాటు చాలా మంచి కథలు వచ్చాయని చెప్పవచ్చు. రచనా ప్రక్రియను ఒక ప్రత్యేక కథగా సాధన చేసేవాళ్ళు ఆనాటి రచయితల్లో ఎక్కువ. కాని పత్రికలు పెరగడంవల్లనో ఏమో, ఆ పట్టు సడలింది. పైగా, ప్రక్రియా పరంగా మంచికథ లన్నవన్నీ పుస్తకరూపంలో రావడానికి ప్రతిబంధకాలు చాలా వచ్చాయి. వెనకటి దశాబ్దాల్లో అదిలేదు ఏరచయితవైనా కథలు పుస్తకరూపం రావాలంటే అతనే చేతి చమురు వదుల్చు కోవాలి. లేదా, ఏ ప్రచురణకర్త అయినా దయతలిస్తే కద్దు, లేకపోతే లేదు. కథకున్న కాస్తచోటూ నవల ఆక్రమించేస్తూ వస్తోంది. కథల సంపుటమనే సరికి మన ప్రచురణకర్తలు పెదవి విరిచేస్తారు - అదేదో పనికిమాలిన పదార్థమన్నట్టు. అయితేనేం ? అప్పటికంటె పత్రికల సంఖ్య పెరిగింది. కథలు దండిగా వస్తున్నాయి. ఈ విషయంలో మనది నిత్తెపంట !

అయితే రాశి పెరిగినంతగా వాసిపెరగడం లేదన్నది కొందరు విమర్శకులు అంటూండేమాట. ఇప్పుడేకాదు, ఎప్పుడూ అలాటి విమర్శలు ఏ విషయంలోనైనా వస్తూఉండేవే "ఏదో రాసిపారెయ్యా"లన్న ఉబలాటం ఎంత చెడ్డదో, "ఏదో రాసి పారేస్తే చాల్లే" అన్న నిర్లిప్తతకూడా అంత చెడ్డది. వాటిఫలితంగా వచ్చేవి నాసిరకం రచనలు, అంతేకాదు ఏవో కొన్ని సిద్ధాంతాల్ని ప్రచారం చెయ్యడానికి- ముఖ్యంగా రాజకీయాలు- చేపట్టే రచనల్లో సాహిత్యదృష్టి తగ్గి ప్రచారదృష్టి ఎక్కువవుతున్న సందర్భాలుకూడా ఉన్నాయి. కేవలం సిద్ధాంతాల్ని అధ్యయనం చెయ్యాలంటే ఈ కథలే అక్కర్లేదు ; ఆయా విషయాలమీద అధికారికంగా రాసిన రచనలు ఉన్నాయి ఒకవేళ రచయిత, వాటిని ఆనుషంగికంగా ఉపయోగించుకో దలుచుకుంటే, వాటిని కథలో అంతర్భవింపజేసి రాయవలసిందే కాని ప్రచార ధోరణికి పూనుకోగూడదు. దానివల్లే ఇటీవల వస్తున్న కొన్ని కథలు ఒకే రకం మూసలో పోసిన ప్రచార కథల్లా తేలిపోతున్నాయి.

అంతమాత్రాన నిరాశ చెందడానికి ఆస్కారంలేదు. కథానికా ప్రక్రియను సరిగా ఆకళించుకుని జాగ్రత్తగా రచనచేసేవాళ్ళు తెలుగుదేశంలో లేకపోలేదు.

అయితే దానిపట్ల ఉత్సాహం, దానికి తగ్గ ప్రోత్సాహం సమకూరాలి సృజనాన క్తి వాళ్ళలో దీప్తిమంతంకావాలి. అందుకు తోడ్పడేవి సాహిత్య గోష్ఠులు, అనువాద గ్రంథాలు, విమర్శగ్రంథాలు. 

తెలుగు కథారచయితల కృషిని ఇతరులకు తెలియజెయ్యడంలోను, ఇతరుల కృషిని తెలుగువాళ్ళకు తెలియజెయ్యడంలోను అనేకులు అనువాదకులుగా మన్నన లందుకున్నారు. ఈనాడు దండమూడి మహీధర్, ముక్కామల మల్లేశ్వరరావు, డా॥ భీమసేన్ నిర్మల్, వేమూరి ఆంజనేయశర్మ, వేమూరి రాధాకృష్ణ మూర్తి, డా॥ ఇలపావులూరి పాండురంగారావు గార్లు ఎన్నో తెలుగు కథలని హిందీలోకి, హిందీలోవి తెలుగులోకి అనువదించారు 

వాగ్దేవు పతంజలి, ఎ. మురళీధర్‌గార్లు తెలుగు కథానికలు కొన్ని ఏరి, ఆంగ్లంలోకి అనువదించి ప్రచురింప జేశారు. అలాగే నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు అంతర భారతీయ పుస్తకమాల అన్న శీర్షిక కింద కథాభారతిగా 27 కథలు తెలుగులో ప్రచురించారు. దీనికి సంకలన కర్తలు శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ, శ్రీవాకాటి పాండురంగరావు. వీటిని వివిధ భాషల్లోకి అనువదిస్తున్నారు. హిందీలోకి అనువదించినవారు డా॥ ఇలపావులూరి పాండురంగరావుగారు.



గోదాగ్రంథమాల వారు కొన్ని కథా సంపుటాలు ప్రచురించారు. యం. శేషాచలం కంపెనీవారు ఎమెస్కో ప్రణాళికకింత కొందరు ప్రసిద్ధుల కథలతో బాటు విద్యార్థి రచయితల కథలతో కొన్ని సంపుటాలు వెలువరించారు. ఇలా ఎందరో ఉన్నారు.

మన విశ్వవిద్యాలయాల్లో 'కథానిక' లాంటి ఆధునిక సాహిత్య ప్రక్రియల్ని గురించి బోధించరు. అందువల్ల వర్ధమాన కథకులకు, ఆప్రక్రియలో ఉన్న సాధక బాధకాల్ని అధ్యయనం చేసే అవకాశం లేకుండా పోతుంది. అరవై డెబ్భై ఏళ్ళ క్రితం ఇంగ్లీషులోను, ఇటీవల హిందీలోనూ కథానికా ప్రక్రియగురించి వెలువడ్డ విమర్శా సాహిత్యం చాలా ఎక్కువ. ఇలా కథల ఉత్పత్తితోబాటు విమర్శకూడా పెరుగుతూంటే తెలుగులో ఈ శాఖ బాగా అభివృద్ధి చెందుతుంది.

ఇదీ ఈనాటి కథానికా వాఙ్మయం పరిస్థితి : దీన్ని మెరుగుపరచాలంటే ఇటు రచయితలూ, అటు పత్రికాధిపతులూ, ప్రచురణ కర్తలూ, విమర్శకులూ

కూడా సమష్టిగాను, వ్యష్టిగాను ఎంతో కృషి చేయవలసి ఉంటుంది. తెలుగు జనజీవనాన్నీ, వర్తమానకాలమాన పరిస్థితుల్నీ, తెలుగువాళ్ళ ఆశానిరాశల్నీ, వ్యక్తిత్వ వికాసాలకు కలుగుతున్న అవరోధాల్నీ, అన్నిరంగాల్లోనూ జరుగుతున్న దోపిడీల్నీ అన్యాయాల్నీ అక్రమాల్ని చిత్రించే సహజమైన కథలు ఇతోధికంగా రావాలి. ఆత్మవిశ్వాసాన్ని పాదుకొల్పి అభ్యున్నతి నందుకోడానికి స్ఫూర్తి నివ్వాలి. ఈ మాదిరిగా అందం, ఆనందం రెండూ అందించేటట్లుగా తెలుగుకథ వర్ధిల్లుతుందని ఆశిద్దాం.

